# 14-9-62

ఆంధ్రసచిత్రవారపత్రిక

నుంచి

## ప్రారంభం!

# 'బంగారు పంజరం'

రచన: శ్రీమతి క్షోమలాదేవి

రూ. 1000

బహుమతి పొందిన నవల

# ఉత్తరాలు

## సరాగమాల !

వి.ఎ.కె. రంగారావుగారి సరాగమాల శీర్షిక చాలా ఉత్సాహకరంగా ఉంటోంది. కాని వారు ఎక్కువ సినిమా రికార్డులను గురించే వ్రాస్తున్నారు. సినిమా సంగీతం విని విని విసుగు పుడుతున్నది. కాన వారు 'లలిత సంగీతం' రికార్డులను గురించి, ఆ గాయకులను గురించి ఉత్సాహకరమయిన విషయముల తెలియజేయగలరని కోరుచున్నాను.

ఇ. హేమచందర్ (హనుమకొండ)

* * *

"మంచి మనసులు" చిత్రంలో 'రికార్డింగ్' నందు కొన్ని లోపాలు ఉన్నాయి. "సూత్రాలలోన చైతన్య మొనగి, సరిగమ పదనిస స్వరములే పాడగా" అనే చరణం అవగానే "మ్యూజిక్" ఉంటుంది. ఇదే "రికార్డు" నందు లేదు. ఇదే పాట చివర "చెలి" అనే చివరి చరణాలు రికార్డునందు లేవు. స్థలాభావముచేత పూర్తిగ రికార్డింగ్ జరుగలేదా?

"ఎంత టక్కరివాడు" అనే పాటయందు "ఎవ్వరో పైట లాగినట్లున్నది" పాఠకులు మన్నింతురుగాక) అనే చరణం సినిమాయందు ఒక్క పర్యాయము ఉన్నది. అదే రికార్డునందు రెండు పర్యాయము లున్నది. ముందుగ రికార్డింగ్ జరిగినదా? షూటింగ్ జరిగినదా?

టి. వి. భాస్కరరెడ్డి (వరంగల్)

* * *

"రాజమకుటం" చిత్రం నుంచి శ్రీమతి పి. లీల పాడిన "అంజలిదే జననీ" అన్న పాట నన్ను బాగా ఆకర్షించింది. చిత్రంలోని ఇతర రికార్డులు లభ్యమైనవి గాని, ఈ పాట గల రికార్డు మా ప్రాంతాల్లో లభ్యంకాలేదు. ఆ పాటను వినగల మార్గ మేదైనా తెలుపుతారా? ఆ పాటలోని వైశిష్ట్యన్ని కూడా తెలియజేయరూ!

ఇదేవిధంగా "ఇద్దరు మిత్రులు" చిత్రంలోని "ఓహో ఫేషన్ల సీతాకోక చిలుకా" అన్న పాట అర్థం కలదైనా మిగిలినవాటి అంత ప్రచారంలోకి రాలేదు. తెలిస్తే కారణం చెప్పరూ?

ఎం. సత్యనారాయణమూర్తి (మీనవిల్లూరు)

* * *

మీకు ముఖ్యంగా వ్రాసేది. కుంకుమరేఖలో పి. సుశీల పాడిన "నీవు వెలిగించు" అన్న పాట చాలా సార్లు విన్నాను. కాని అది సినిమాలో లేదుకదా! అలా రికార్డు ఎలా ఆ సినిమాలోనిది బయటకు వచ్చింది.? తెలియబరుస్తారా?

తరువాత చెంచులక్ష్మిలో 'చిలకా గోరువంక' 'చెట్టూ లెక్కగలవా' అన్న పాటలు జిక్కి, ఘంటసాల పాడినవి వింటున్నాము. కాని ఈ పాటలే 'చెంచులక్ష్మి' వని పి. సుశీల, పి. బి. శ్రీనివాస్ పాడినవి కూడా విన్నాము. ఇలా యిద్దరు ఈ డ్యూయట్స్ పాడటం ఎలా జరిగింది? చాలా కుతూహలంగా ఉంది. దయచేసి తెలియపరుస్తారా?

కోకా. భానుమతి (తుని)

## స్వాతంత్ర్య దినోత్సవ సంచిక

స్వాతంత్ర్యదినోత్సవ సంచిక అట్టమీది బొమ్మ ఆకర్షణీయంగా ఉంది. కాని ఈ సంచికలో ప్రత్యేకత ఏమి లేకపోవడంతో చాలా విచారంగా ఉంది.

మూల. ప్రభాకరరెడ్డి (హైదరాబాదు)

17—8—62 సంచిక ముఖచిత్రంలో కొద్ది లోప మున్నదని నా భావన. జాతీయ పతాకావిష్కరణ సమయమందు నిశ్శబ్దముగా, సావధానులై (Attention) అందరూ ఉండవలయు నన్నది ప్రాథమిక సూత్రము గదా? కొందరు పిల్లలు చప్పట్లు, కొందరు నవ్వుతూ, కొందరు ప్రక్కవాళ్లతో మాట్లాడుతూ! క్రమశిక్షణలేని పిల్లలను ముఖచిత్రంమీద వేయుట ఏమంత సమంజసంగాలేదు.

రాజనాల (విజయనగరం)

* * *

స్వాతంత్ర్య దినోత్సవ సంచికలో 23 వ పేజీ లోని పిల్లలకు ప్రత్యేకం, బొమ్మల నుడికట్టు అని చిత్రపటము వేసి ప్రక్క పేజీలో జవాబు వేసితిరి ఎందుకని? అది మీరు వ్రాసినదా లేక పిల్లలు వ్రాసినదా?

సాంబిరెడ్డి (కొల్లిపర)

## కనుక్కోండి చూద్దాం !

* * *

17—8—62 వ తేదీ సంచికలో 24 వ పేజీలో 'మాప్‌లో ఉన్న దేశాలు' మరియు 'పుస్తకాలతో మీ పరిచయం' అను రెండు శీర్షికలు తలక్రిందులుగా అచ్చు పడినవి. ఇకమీద ఇటువంటి అచ్చు పొరపాటు పడకుండ జాగ్రత్తగా ప్రచురించగలరు.

టి. సత్యనారాయణ, జి. బి. మహేందర్ (మచ్చబొల్లారం)

* * *

అయితే "బంగారం—సింగారం" 'రేఖా' చిత్రకథ రచించినది మన "బాపూ" గారే నన్నమాట!

నాగం వెంకటగోపాలరావు (మచిలీపట్నం)

**అన్నమాటే !**

## బుడుగు నీతులు

"శ్రీ బుడుగు (గారు) కొన్ని నీతులు చెప్తారు" అని వ్రాశారు. 'శ్రీ' అని మన్నించక్కరలేదు అనుకొంటాను. "చిరంజీవి" అని వ్రాస్తే బాగుండేది. ఎందుకంటే బుడుగు కథ, చిత్రములు వేసినవి శ్రీ బాపుగారే అయినా బుడుగు చాలా చిన్నవాడేగా!

పద్మశ్రీ (పొతగుంటూరు)

* * *

స్వాతంత్ర్య దినోత్సవ సంచికలో బుడుగు చెప్పిన నీతులు చాలా బాగా యున్నాయండీ! శ్రీ బాపు గారికి ఆడపిల్లని చెప్పారు ......

"సురేఖ" (బాపట్ల)

## సీరియల్ కథ

కన్నడ మాతృకకు అనువాదం "వెండిమబ్బు" సీరియల్ చాల బాగుంది. ఇంత ఉత్తమమైన నవల ఈమధ్య ప్రచురించబడలేదు. మైసూరు ప్రాంతాలను చక్కగా వర్ణించారు. జీవితంలో నిక్కచ్చిగా ప్రవర్తించే మనుషుల్ని చూస్తే మంచి అభిప్రాయం కలుగదు చాలమందికి. అటువంటి తెగకు చెందిన ఇందిరలోని అమాయకత్వం, పవిత్రత, పట్టుదల, త్యాగం చక్కగా చిత్రించారు రచయిత. ఒక్కోచోట సంఘటనలు మరీ విచిత్రంగా ఉంటున్నాయి.

రచయిత 'త్రివేణి' గార్కి, అనువాదకులు 'శర్వాణి' గార్కి నా అభినందనలు.

డి. మధుసూదన్ (హైదరాబాదు)

* *

వెండిమబ్బు ప్రసాదించిన శర్వాణిగారూ! మీ కథలో ఒక్కొక్క మలుపూ ఒక్కొక్క మణిపూస. అవన్నీ దండగ్రుచ్చి మీ మెడలో వేయాలనుంది.

కె. సావిత్రమ్మ (బిలాస్పూర్)

## చదువుగ్రావు

వ్హాట్! చదువుగ్రావ్! బస్సులో ఏదైనా చారల గుడ్డ తాను సప్లయి చేశావా! ముగ్గురు జమాయించారులే.

'షేష్' (రాజమండ్రి)

## కథలు

"నిజంతో దోబూచులాట" కథలో "కమ్మగా ఉన్న పాలు విరిగినట్టు ప్రకృతి ఒక్కసారిగా నల్లబడింది" అని ఉపమానము వ్రాశారు. కాని అది ఏ అలంకారములోనిది? లేక ఏ రకము? లేక వ్యతిరేకాలంకారమా?

కె. వాసుదేవరావు (కల్లూరు)

* * *

"బస్సులో అమ్మాయిలను చూడగానే ఒళ్లు తెలియకుండా బస్సు నెంబరు కూడా చూడకుండా బస్సులోకి ఎక్కే చదువుగ్రావులాంటి వాళ్లకి ఈవారం అట్టమీది బొమ్మ ఒక చెప్పుదెబ్బ లాంటిది" సుశీలాదేవి (హైదరాబాదు) గారు వ్రాసిన ఉత్తరము సరిపోటిది కాదని నా మనవి. బస్సు నెంబరు చూడకుండనే బస్సులోని అమ్మాయిలను చూచుట కష్టం. పెద్ద అంకెలలో ముందు తల భాగమున వేసియున్న అంకెలు ముందుగా కనబడునే గాని, బస్సులో యున్న అమ్మాయిలు దూరమున నున్న చదువుగ్రావులాంటి వాళ్లకైన కనబడరు. అలాంటప్పుడు కాలపరిస్థితిని తెలియకుండ 'చెప్పుదెబ్బలాంటిది' యని వాడుట సమంజసముకాదు.

సి. శివశంకరనాయుడు (మద్రాసు)

* * *

మీరు తేది 17—8—62 స్వాతంత్ర్య దినోత్సవ సంచికలో ప్రచురించిన, శ్రీ ఎం. ఎల్. పతి గారి "మీటింగు" అన్న కథానికను చదివి చాలా విచారించాను. శ్రీ ఎం. ఎల్. పతిగారు వారి రచనలో వాటి నైజాం హయాంలో ప్రజలచే వాడబడే భాష సరళిలో వ్రాసినారో లేక నేటికి అదేభాష అమలులో ఉన్నదని తెలుపుటకు వ్రాసినారో ఊహించలేకుండా ఉన్నాను. ఆంధ్రప్రదేష్ అవతరణానంతరం ఆంధ్రప్రదేష్ రాజధాని నగరమైన హైదరాబాదులో ఎన్ని మార్పులు వచ్చినాయో బహుశః శ్రీ ఎం. ఎల్. పతిగారికి తెలియదను కుంటాను.

భాష సరళిలో తప్ప కథారచన, మిగతా అన్ని రంగాలలో బాగుగా ఉంది. కాని ముగింపులో మాత్రం శ్రీ పతిగారు తిరిగి అచ్చుతెనుగు వాక్యాలను ఉపయోగించారు.

యాదగిరి (నిజామాబాదు)

తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది.

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం: 31—8—62
సంపుటము : 54 సంచిక : 52
శుభకృత్ సం॥ భాద్రపద మా॥ శుద్ధ పాడ్యమి

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకులు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు : ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానంద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా: 135.00.)

విడిప్రతి : 25 న. పై

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీథి, మద్రాసు-1





శ్రీ విఘ్ననాయకుడు.

# మనలోమాట

1961 ఉగాదినుంచి 1962 ఉగాది వరకూ, ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 144 కథలు పడ్డాయి. ఇవన్నీ వ్రాసిన రచయితలు 73 మంది.

అందరికన్నా ఎక్కువ కథలు ప్రచురణ అయిన రచయిత 'రంగధామ్' (10 కథలు), ఆతర్వాత వారు: సింగరాజు రామచంద్రమూర్తి (8 కథలు) భూపతి, ఆదివిష్ణు (ఒక్కొక్కరూ 8 కథలు), హావిస్, జి. సూర్యప్రకాశరావు, ఆర్. యం. చిదంబరం, వాకాటి పాండురంగారావు, డి. హనుమంతరావు (ఒక్కొక్కరూ 4 కథలు.)

అంటే, అందరికన్నా ఎక్కువ కథలు వ్రాసి ప్రచురించుకున్న రచయితకికూడా సగటున మాసానికి ఒక కథఐనా పడలేదన్నమాట! అంతేకాక, మొత్తం కథల సంఖ్యలో ఈ రచయిత కథల సుమారు 6% మాత్రమే.

అసలు కథల సంఖ్యకు రచయితల సంఖ్య 'నిష్పత్తి' ఇంచుమించు 2:1 ఉంది.

ఈ లెక్కలన్నీ ఎందుకని ఎవరయినా అనుకోవచ్చు! కాని తెలుగు రచయితలలో ఉత్సాహం ఎంత ఎక్కువగా ఉందో పై వివరాలు తెలుపుతాయి. ఈ సంవత్సరం మాకు వచ్చేకథలు అంత బాగా లేవు. సంఖ్యకూడా తగ్గింది. (అందుచేతనే ఇతర శీర్షికలు అధికం అవుతున్నాయి!)

అయినా 'పరిస్థితి' బాగుపడుతుందనే ఆశ వదులుకోవటం లేదు!!

# లోకంపోకడ



"ఏమండీ! డాక్టరుగారూ! సంపూర్ణ మద్య నిషేధం గురించి మీ అభిప్రాయం ఏమిటి?

"ఆర్థికంగా అది మాకు చాలా ప్రయోజనకారిగా వుంటుంది. ఎందుకంటే ఇతరచోట్లనుంచి దొంగతనంగా దిగుమతైన మద్యం త్రాగి దెబ్బతిన్న రోగులు కుప్పలుగా వస్తారు. మాకు డబ్బువస్తుంది. పోనీ నైతికంగానా? ప్చ్! ఎవరికీ ఏమీ ప్రయోజనం లేదు"

## విషయానుక్రమణిక


నమస్తే రాజాజీ! తమరు నాకు మార్గ దర్శకులు
అయినా ఇప్పుడు మనం ప్రత్యర్థులం
ఫత్తేసింగు
తారాసింగు
పాక్ అధ్యక్షుడు అమెరికా వెడుతున్నారు. భారత దేశం పాకిస్తాన్‌కు చేస్తున్న అన్యాయాన్ని అకడ చాటి చెబుతారు
భయపడకండి నేను కాంగ్రెసుపులిని మాత్రమే చంపుతాను
సాంఘికదురలవాట్లు
అవినీతి
అధికధరలు
బ్లాక్ మార్కెట్

# కథ కాని కథ

## పేరులోన గలదు పెన్నిధి?

(మొదటి బహుమతి)

ఒక రోజున నేను, నా స్నేహితుడు ఒకే సైకిల్ మీద కాలేజీ నుంచి ఇంటికి వస్తున్నాము. దారిలో ఒక పోలీసు కానిస్టేబుల్ ఎదురై మమ్మల్నిద్దర్నీ పట్టుకుని మా పేర్లు వ్రాసుకుని మరునాడు కోర్టుకి రమ్మని చెప్పి వెళ్ళిపోయాడు.

మరునాడు ప్రొద్దున్న పదిగంటలకి నేను, నా స్నేహితుడు కోర్టుకి వెళ్ళాం. కొంతసేపటికి మమ్మల్నిద్దర్నీ పిలిచారు. మమల్ని మేజిస్ట్రేటు అడిగిన ప్రశ్నలివి.

"మీ రిద్దరూ డబుల్ రైడింగ్ చేశారా?"

"చేశాము."

మమ్మల్ని యిలా అడిగి రిజిస్టర్‌లోని మా పేర్లు చూసి ఆశ్చర్యపోయాడు. అప్పటిదాకా డబుల్ రైడింగ్ కేసులలో మనిషికి రూ. 5 చొప్పున జరిమానా వేసే ఆయన మమ్మల్ని చూసి "ఏమయ్యా! ఇంత పెద్దపెద్ద పేర్లు పెట్టుకుని మీరే ఇలా రూల్సుకి వ్యతిరేకంగా నడిస్తే ఎలా?" అని మందలించి మాయిద్దరికీ చెరో పదిరూపాయలు జరిమానా విధించాడు.

ఇంక మా అవస్థ ఏమని చెప్పం? ఇంతకీ మా పేర్లేమిటో తెలుసా? నా పేరు "జవహర లాల్ నెహ్రూ", మా స్నేహితుని పేరు "రాజేంద్ర ప్రసాద్."

కె. జవహర్ లాల్ నెహ్రూ (ఏలూరు)

*　　*　　*

## తమ్ముని కోరిక

(రెండవ బహుమతి)

మొన్న మధ్యాహ్న మా తమ్ముడు కోరుకొండ సైనిక్ స్కూలు నుండి వచ్చాడు. మా చెల్లాయి సహా తమ్ముడిని 'ఒరే! నీవు దేవుడిని అసలు తలచుకుంటున్నావా?' అని అడిగింది. అందుకు మా తమ్ముడు వెంటనే నేను రోజు పడుకోబోయే ముందు రాత్రి తలుచుకొంటాను మా చెల్లి ఏమని తలచుకొంటావు. అని అడిగితే మా తమ్ముడు ఏముంది దేవా! నిన్న నాకు బాగా నిద్రపట్టింది. మీ దయవలన రాత్రికి కూడ బాగా నిద్ర పట్టించండి దేవా అని మ్రొక్కుకుంటాను. అనగానే మే మంతా గొల్లున నవ్వాము. మా తమ్ముడి తెలివితేటలకు (గమనించ ప్రార్థన) తమ్ముడి వయస్సు. 8 సంవత్సరములు.

కుమారి కమల (హైదరాబాదు)

*　　*　　*

## గంటకో దెబ్బ!

(రెండవ బహుమతి)

ఈసంగతి ఇటీవలనే మా ఇంట్లో జరిగింది. ఒకరోజున నేను, మా అన్నయ్య కలసి పేకాడుతున్నాము. మా అన్నయ్యకన్న నాదే పైచేయి అగుటచేత మా అన్నయ్య కోపముగా ఆడుతున్నాడు. ఇంతలోనే మా చిన్నతమ్ముడు వచ్చి మా అన్నయ్యను టైమెంతయిందని అడిగాడు. మా అన్నయ్య అసలే కోపముగా ఉండుటచేత దగ్గరకు రమ్మని వీపుమీద ఒక్కటి గుద్దాడు. 'ఇంతైంది టైము'ని చెప్పాడు. అప్పుడు ఒంటిగంట అయింది. దాంతో మా తమ్ముడు 'అయ్యబాబోయ్ నయమే ఇంకా గంట్రకితం అడగలేదు.' అంటూ పరిగెత్తాడు దాంతో నాకు నవ్వాగలేదు. నాతోపాటు మా అన్నయ్యకుకూడ నవ్వాగలేదు.

ఎస్. ఎల్. మాధవరావు, (ఆచంట)

## "అజంతా అంటే?"

(రెండవ బహుమతి)

ఒకనాడు మా తెలుగుపంతులుగారు 'అజంతాగుహాలవిహారయాత్ర' అనే పాఠము చెబుతున్నారు. పాఠము చదువుతూ పంతులుగారు "అజంతా అనునది ఒక గుహ" అని అన్నారు.

వెంటనే మాలో ఒక పెంకి కుర్రవాడు లేచి - 'సార్ అజంతా అనేది ఒక నది' అని మీరే చదివి, మళ్లీ వెంటనే "గుహ" అంటున్నారు, మా కర్థము కాలేదండీ, అన్నాడు."

పంతులుగారు, తక్కిన విద్యార్థులము అర్థముచేసుకొని పకపకనవ్వుకున్నాము. ★

యర్రమిల్లి సత్యమూర్తి (ఖర్గపూర్

# హరివంశము

హారీత శివశర్మ

## సాందీపని పర్వం- 71

మనస్సు విచిత్రమైనది. అది విచిత్రమైన పోకడలు పోవును. కొందరియందు నిలకడగా నుండి నిండిన తటాకమువలె నుండి శాంతమై ప్రకాశించును. కొందరియందు అపూర్ణమైన గళంతిక వలె నుండి తబకలాడును. ఎందుల కిది యిట్లుండును ? ఎవ్వరును చెప్పలేరు. కాని ఆ చెప్పుటకు ప్రయత్నించువారు ఇంద్రియ నిగ్రహాదికములైన మార్గముల నవలంబింతురు. మరి ఆ మార్గములయం దేది నిజమో ఎవ్వ రెరుగుదురు ? అనుభవించినవారు ఎరుగుదురు. మరి అనుభవమనేమి ! దానికి సాధారణ్యత ఎక్కడ ! ఏలన ఎవరి అనుభవము వారిది. అందరి అనుభవమును ఒక్క తీరుగా నుండవలయునని లేదు. మనస్సు అందరియందును ఒక్క తీరుగా నున్నచో అనుభవ మందరియందును ఒక్క తీరుగనుండును. అది అట్లుండుట అరిది గనుక ఆ అనుభవమును ఒక్క తీరుగా నుండుట యుండదు. సుదక్షిణ యున్నది. ఆమె కష్టములలోనను, సుఖములలోనను నివాత స్థిమితమైన దీపమును పోలి ఒక్క తీరుగా నుండుచున్నది. ఆమె తన సర్వేంద్రియములను, సర్వమైన వాంఛలను నిగ్రహించుకొనినదా ! పౌండ్రకుడు తనలో తాను నవ్వుకొనినాడు. ఆమె శరీరముచేత తన్ను వాంఛించుచున్నది. మనస్సుచేత యాదవుడైన వాసుదేవుని వాంఛించుచున్నది. శరీరమును, మనస్సును ఏకార్థస్థితములైన చోట శాంతి యుండునన్నచో, అశాంతి యన్నది సుదక్షిణయం దుండరాదు. అది తనయం దుండవలయును. తనయందు శరీరమును, మనస్సును ఏకార్థస్థితములై యున్నవి. మరి అశాంతి తనయందు ఎచ్చట నుండి కల్గినది ? పౌండ్రకు డాలోచించినాడు. అతనికి దాని యర్థము తెమలలేదు. రాత్రి చాల భాగము గడచిపోయినది. వాచాలుడు గాఢముగ నిద్రించుచున్నాడు. మూర్ఖులకు శాంతి యున్నది. కానిచో వాచాలునికీ నిద్ర యేల పట్టును. తనకేల పట్టదు. క్షుద్రలో శాంతి యున్నదా ! పౌండ్రకుడు మెత్తని పరుపులపై మేను వాల్చెను. ఆ మెత్తని తనము తనకు సుఖము నిచ్చుటలేదు. ఆనందమును చేకూర్చుటలేదు. తనలో నేదో నజ్ఞాతమైన ఆవేగము పుట్టి, తన్ను నిద్రకు పాలుకానిచ్చుటలేదు. పౌండ్రకుడు లేచెను. తన మందిరమునందు ఏమియు తోచనివాడై క్రుమ్మరిలెను. మేడలమీదకు పోయెను. ఆకాశమున చంద్రుడు పశ్చిమపు ముఖమై బాగుగా ఒరిగిపోయెను. దూరముగా గంగ మలుపు తిరిగినచోట, నచ్చట పైకి ఎత్తబడిన బంగారపు పద్మమువలెనా చంద్రు డవభాసించుచుండెను. ఆ చంద్రుని చూచుచు పౌండ్రకుడు మేడ అంచులనాని నిలబడెను. చంద్రుడు మన స్సాక్షీయుడని యందురు. అది దబ్బర. ఆ చంద్రునిలో చల్లదన మున్నది. తన మనస్సట్లులేదు. చంద్రుని చల్లదనము గూడ తనయందు చల్లదనమును తెచ్చిపెట్టుటలేదు. అతడు చంద్రు నుపాలంభించెను. ఈ రాత్రియందు చంద్రుడు లేకున్నచో తనకు శాంతి యుండెడిదేమోయని అనుకొనెను. సుదక్షిణ ఏమీ చేయుచున్నది. నిద్దుర పోవుచున్నదా ! సుదక్షిణ మేడలకు పోయినచో తనకు శాంతి లభించునేమో ! పౌండ్రకుడా యాలోచనము చేసి నవ్వుకొనెను. సుదక్షిణ ఇచ్చటకు వచ్చినది. వెడలిపోయినది. ఆమె నన్ను వాంఛించుటలేదు. వాంఛించుచో నిక్కడనే యుండెడిది. లేదో దూతికలచే వార్త నంపెడిది. నేనే పిలువకపోవలయునా ! హఠాత్తుగా పౌండ్రకు డిట్లు అనుకొనెను. సుదక్షిణ తన మేడలకు పోవుచు నాతోనేమన్నది ! ధర్మము చేయమన్నది. ఆమె అనుభవించు శాంతికి ధర్మ మాలంబనమా ! అయిన ఆ ధర్మ మెట్టిది ! మనస్సుచేత పరపురుషుని వాంఛ చేయుట ధర్మమా ! ఈ నా భార్య ఇట్టి దగుటచే నేనీ యశాంతిని పొందుచున్నాను అనుకొనినాడు పౌండ్రకుడు. దూరముగా గంగమీద ఎచ్చటవో ఒక పక్షి కూసినది. అది తన్ను మందలించుచున్నట్లు ఉన్నది. ఓరి ! పౌండ్రకుడ ! నీకు సుదక్షిణ మనస్సు తెలియలేదు. ఆమె శ్రీకృష్ణుని ప్రేమించుచున్నది. ఎట్లు ప్రేమించుచున్నది. ఆయన భగవంతుడని ప్రేమించుచున్నది. అంతియగాని, ఆయనయందు మనుష్య విక్షేపమైన కామమును చేసి ప్రేమించుటలేదు. ఆమె ఆ ప్రేమ అవధులు లేనిది. నిర్భరమైనది. నిన్ను ఆమె అట్లు చూచుటలేదని నీవు అనుకొందువు. నీవు అవధిభూతుడవు. నీయందు తదవధిభూతమైన ప్రేమయును చూపుచునే యున్నది. తన శరీరమును నీకు అర్పించిన దనగా అర్థమేమి ! నీవు ఆమె శరీరమునకు అధిపతివి. శరీర సంబంధ శృంగార రాజ్యమునకు నీవు అధిపతివి. ఆత్మసంబంధి పరమ శృంగారమునకు శ్రీకృష్ణుడు అధిపతి. అందువలననే ఆమె నిత్యము సుఖము ననుభవించుచున్నది. మరి నీవో !

మరి నేనో ! నేను శ్రీకృష్ణునియందు విరోధము చేయుచున్నాను. అతని ప్రేమకు స్థానములైన సర్వములను పరిభవించుటకు చూచుచున్నాను. నిజముగా శ్రీకృష్ణుడు భగవంతుడా ! ఆ భగవంతునియందు ప్రేమవలన చేసి సుదక్షిణ శాంతిని అనుభవించుచున్నదా ! భగవంతుడైన వానియందు విరోధము చేయుట శాంతికి భంజకమా! తాను ఆ విరోధము వలన చేసి ఈ అశాంతిని పొందుట జరుగుచున్నదా ! శ్రీకృష్ణుడు భగవంతు డేమిటి యనుకొన్నాడు పౌండ్రకుడు. అతడు తనకు వలెనే యున్నాడు. మనుష్యుని వలె నున్నాడు. భగవంతు డట్లుండునా ! ఆ భగవంతుడు నామరూపరహితుడని యందురు. ఈ కృష్ణునకు రెండును నున్నవి. రూప మందముగా నున్నది. అది అతని శరీరమునందలి నీలవర్ణమును చేసి వచ్చినది. ఆకాశమువలె సహజమైన నైల్యముచేత నతని రూపము వింతయైన సోయగముతో అందగించుచున్నది. తాను గూడ నా నీలవర్ణము నవధరించుట యందుకే కదా! అట్లవధరించుచో సుదక్షిణ తాను వేషము కట్టినట్లు మేలమాడుచున్నది. అందు చులకన చేయుట యున్నదా ! తన మనస్సున కట్లు అనిపించుటలేదు.

పౌండ్రకుడు తన మేడలను దిగెను. తన మందిరములను వదిలెను. పాదచారియై సుదక్షిణ మేడలకు బయలుదేరెను. తానేల ముందు పోవలదనుకొనినవాడు ఇప్పుడు పోవుచుండెనో అతనికి అర్థముకాలేదు. ఆ అర్థము కాకపోవుటయు అతనికి విచిత్ర మనిపించినది. తన మనస్సామెను వాంఛించగా తాను పోవుచుండెను. అందులో అగను కానిదేమున్నది ! విచిత్ర మేమనగా ఇచ్చట

— 61 వ పేజీ చూడండి



# విశాల నేత్రాలు

పి. గణపతి శాస్త్రి

## జరిగిన కథ

విద్యానగరంలో వేశ్యామాత శృంగార మంజరి ప్రసిద్ధురాలు. హేమసుందరి ఆమె రెండవ కుమార్తె. ఒకనాటి అర్ధరాత్రి వేళ హేమసుందరిని రహస్యంగా కలుసుకొనడానికి వచ్చిన ఆమె ప్రియుడు రంగనాయకుడు, భవంతి కావలివానిని గాయపరచి తప్పించుకుని వెళ్ళిపోతాడు. శృంగారమంజరి భవంతిలో గజదొంగ జొరబడ్డాడని మరునాడు నగరంలో పొక్కిపోతుంది. పట్టణ తలవరి శృంగార మంజరిని, ఆమె కుమార్తెలను కలుసుకుని సంగతి సందర్భాలు విచారిస్తాడు. తిరుమల రెడ్డి ప్రోద్బలంతో మాణిక్యవల్లి హేమసుందరీ రంగనాయకుల ప్రేమకలాపం గూర్చి తెలుసుకుంటుంది. ఆ మరునాడు రంగనాయకుని రహస్యం రెడ్డి చెవిలో వేస్తుంది. దానితో తన కోరిక నెరవేర గలదని ఆనందిస్తుంది. కాని తిరుమలరెడ్డి కోడెత్రాచులాగా రాజుకుని ఏదో పని ఉన్నదని చెప్పి ఇంటికి వెళ్ళిపోతాడు. ఆ మరునా డుదయం తలవరితో రంగనాయకుని సంగతి చెబుతాడు. కాని అతను కొంచెం సద్దిచెప్పి ఓదారుస్తాడు. తిరుమల రెడ్డి ఇంటికి వచ్చి దాసి ముత్యాలు ద్వారా హేమసుందరి కొక ఉంగరం పంపిస్తాడు. రంగనాయకుని కొట్టి రావలసినదని సింహాచలాన్ని ప్రోత్సహిస్తాడు. కాని వాడు దాని కంగీకరించక నసుగుతాడు.

సాయంకాలం కొంచెం చల్లబడిన తరవాత, విద్యానగరంలో వీరహనుమానుని దేవాలయం విశాలావరణంలో యువకు లయిదారుగురు ఒక చోట చేరి సాము గరడీ ఆరంభించారు. వారికి మరికొంత దూరంలో ఇంకొక పదిమంది కత్తిసాము కొనసాగించారు. మరికొందరింకొకచోట జేరి వేర్వేరు శరీర వ్యాయామాల సాధనలో నిమగ్ను లయినారు. సాయంకాలం నీరెండ వెలుగులో ఎర్రమన్ను పూసిన వారి శరీరాలు బంగారు విగ్రహాలవలె గోచరించాయి.

రంగనాయకుడా ఆవరణంలో ఇంకొకమూల నిలబడి కుడి ఎడమ చేతులతో నిలువెత్తు బాణాకర్ర తిప్పుతున్నాడు. గోపాలయ్య అతనికి నాలు

–55 వ పేజీ చూడండి

*

అగజానన పద్మార్కం
గజానన మహర్నిశం
అనేకదంతం భక్తానా
మేకదంత ముపాస్మహే

"ఓ బొజ్జగణపయ్య నీబంటు నేనయ్య" అంటూ త్రిమూర్తులు సైతం, వినాయకుణ్ణితలంచనిదే ఏకార్యమూ ప్రారంభించరన్నది నానుడి. పని తలపెట్టాలన్నా, ఆ సంకల్పం సిద్ధించాలన్నా విఘ్నేశ్వరుని తల్చుకొననిదే అది ఫలించదన్నది ప్రజల నమ్మిక.

విద్యార్థులకు విద్యలు విద్యావంతులకుఉద్యోగాలు కన్నెపిల్లలకు కనునిండైన వరులు అందమైన అబ్బాయిలకు మంచి అమ్మాయిలూ రాజకీయనాయకులకుసీట్లూ వ్యాపార శిఖామణులకు పెర్మిట్లు యిలా అందరికీ అన్ని కోర్కెలను యీడేర్చే వరప్రసాదమూర్తి ఏకదంత మూర్తి శ్రీ గణేశుడు.

సకల జనులకు ఇష్టదైవమైన శ్రీవినాయకుడు ఆంధ్ర సచిత్ర వారపత్రికకు ప్రత్యేకించి ఇష్టదైవము.

సరిగ్గా నేటికి 55 సంవత్సరాలకు క్రితం శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రపత్రిక (వారపత్రిక)ను వినాయక చవితి నవరాత్రి ఉత్సవముల సందర్భమున స్థాపించారు. "ఆంధ్రసచిత్రవారపత్రిక" ఆంధ్రపత్రిక సంస్థ ప్రచురణ.

నీలాప నిందలుబాపే విఘ్నదేవునికి సకలజనులూ సత్సంకల్ప సిద్ధికై జోతలిడుతూ ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకులకు ప్రత్యేక శుభాభినందనలను అందజేస్తున్నాము!

# మనము - మన దేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

## కడుపు ఉబ్బు: 1

కడుపు ఉబ్బరించడం చాలా సాధారణంగా తటస్థించే రోగస్థితి. సాధారణంగా ఈ స్థితి అజీర్ణంవల్ల ఏర్పడుతుంది. జీర్ణకరౌషధములు తీసుకున్నందువల్ల, ఆహారంలో మార్పులవల్ల ఒకటి రెండు రోజులలో ఈ లక్షణం సర్దుకుంటుంది. కాని ఒక్కొక్కప్పుడు ఈ బాధ స్వల్పకాలంలో తగ్గక చాలాకాలం బాధిస్తుంది. అప్పుడది ప్రమాదకరమైన వ్యాధులకు లక్షణము కావచ్చును. అందుకని, ఆ విషయమై సమగ్రంగా తెలుసుకోడం అవసరం.

జీర్ణకోశభాగములను గురించీ అందులో జరిగే రసాయనిక కార్యక్రమమును గురించీ ఇదివరకే సవివరంగానే వర్ణించాను. ఇప్పుడు జఠరాశయ వ్యాధులను వివరిస్తున్నాను. "ఆరోగ్యానికి దూరం కావడమే రోగం." ఆరోగ్యస్థితిలో అంగము యొక్క రూపమునూ, నిర్మితినీ, ధర్మమునూ వివరించేది "ఫిజియాలజీ" (శరీరధర్మశాస్త్రము.) రోగస్థితిలో అంగములలోనూ, వాటి ధర్మములలోనూ జరిగే మార్పులను వివరించేది పేథాలజీ. (Pathology) అంటే రోగవిజ్ఞానము. ఆరోగ్యస్థితిలో అంగము ఎల్లా ఉంటుందో ఎల్లా పని చేస్తుందో ఆ అంగము అల్లా పనిచేయకపోతే ఏఏ అంగముల ధర్మములలో మార్పులేర్పడతవో తెలియకపోతే రోగస్వరూప స్వభావములను తెలుసుకోడం కష్టం. పాఠకులు జీర్ణకోశమునుగురించి వివరించిన విషయములు మళ్లీ ఒకమాటు మననం చేసుకుంటే జఠరాశయరోగములను గురించి చక్కగా అర్థంచేసుకోగలుగుతారు. వైద్య విద్యార్థులకు ఈ అంగములనూ, శరీరాంతరాళములలో వాటి పరస్పర సంబంధములనూ, రోగస్థితిలో వాటిలో జరిగే మార్పులనూ ప్రత్యక్షంగా చూచే అవకాశం ఉంటుంది. సాధారణ పత్రికాపాఠకులకు ఈ అవకాశం ఉండదు. వారు చిత్రములను చూచీ, శరీరధర్మశాస్త్ర విషయములను జ్ఞప్తిలో ఉంచుకొని, కొంత ఊహించీ శరీరవిషయములను అర్థంచేసుకోవాలి. కాని శరీరాంతరాళములలో ఉన్న అంగములలో ఏర్పడిన మార్పులకు ఫలితంగా శరీరోపరి భాగములలో చాలా మార్పులు కలుగుతవి. ఆమార్పులను గమనిస్తే చాలవరకు శరీరాంతరాళములలో జరిగే మార్పులను ఊహించవచ్చును. ఈ మార్పులను గమనించడానికి నాలుగు మార్గములు అనుభవంవల్ల వైద్యులు ఏర్పరచుకున్నారు. అవి:

(1) కంటితో చూడడం. (Inspection)
(2) చేతితో తడిమి చూడడం (Palpation)
(3) వేలితో కొట్టిచూడడం(Percussion)
(4) వినడం (Ansullation)




1 కుడిహైపో కాండ్రియం
2 ఎపిగాస్ట్రిక్ ప్రదేశము
3 ఎడమహైపో కాండ్రియం
4 కుడి కటి ప్రదేశము
5 నాభి ప్రదేశము
6 ఎడమ కటిప్రదేశము
7 కుడి తుంటిప్రదేశము
8 హైపోగేస్ట్రిక్ ప్రదేశము
9 ఎడమతుంటిప్రదేశము




* మోడలు ఎ-730

# ఎంచుకొందుకు వీలుగా సొగసైన వివిధ మోడలుల

# నేషనల్ ఎకో రేడియోలు

నేషనల్-ఎకో రేడియోల వివిధ మోడలులలో ఒకటి మీకు తప్పకుండా నచ్చుతుంది! నేషనల్-ఎకో రేడియో ఏదైనా శ్రేష్ఠమైనది, అద్భుతముగా పనిచేస్తుంది. అది గంటలతరబడి వినోద కార్యక్రమములను లందచేస్తుంది. దానిని ఏళ్లతరబడి విని ఆనందించగలరు.

నేషనల్-ఎకో రేడియోలు 10 అద్భుతమైన మోడలులలో కలవు. వాటి ధర రు. 125.00 అంత తక్కువనుండి రు. 725.00 వరకు ఉంది.



మోడలు యు-764 : ఎసి/డిసి సెట్. 5 వాల్వులు, 3 బ్యాండులు. అందమైన క్యాబినెట్. మోడలు బి-764 : డ్రై బ్యాటరీ సెట్. 4 వాల్వులు, 3 బ్యాండులు. రు. 265



మోడలు యు-755; ఎసి/డిసి సెట్. 6 'నోవల్' వాల్వులు. 3 బ్యాండులు. కఱ్ఱ క్యాబినెట్. మోడలు బి-755: డ్రై బ్యాటరీ సెట్. 5 'నోవల్' వాల్వులు, 3 బ్యాండులు. కఱ్ఱ క్యాబినెట్. రు. 355




మోడలు యు-756 (జనతా): ఎసి/డిసి సెట్. 3 వాల్వులు మరియు రెక్టిఫైయర్. 2 బ్యాండులు: మీడియమ్ మరియు షార్ట్‌వేవ్, సొగసైన క్యాబినెట్.

మోడలు ఎ-744 : ఎసి సెట్. 9 విధములుగా పనిచేసే 6 'నోవల్' వాల్వులు. 4 బ్యాండులు. అందమైన క్యాబినెట్. రు. 405






నేషనల్-ఎకో రేడియోలు శ్రేష్ఠమైనవి... అవి 'మాన్‌సూనైజ్' చేయబడినవి

* మోడలు ఎ-730: ఎసి సెట్. 9 విధములుగా పనిచేసే 6 'నోవల్' వాల్వులు. 8 బ్యాండులు. కఱ్ఱ క్యాబినెట్. మోడలు యు-730: ఎసి/డిసి సెట్. రు. 570

అన్ని ధరలూ ఎక్సైజ్ డ్యూటీతో సహా; పన్నులు అదనము



జెనరల్ రేడియో & అప్లయన్సెస్ లిమిటెడ్
బొంబాయి . కలకత్తా . మద్రాసు . ఢిల్లీ . పాట్నా . బెంగుళూరు . సికిందరాబాదు

JWT-GRA 3470

# మనమూ-మన దేహస్థితి

ఆరోగ్యంలో ఉన్న మానవశరీరాన్ని గమనిస్తే, కొన్ని నిమ్నోన్నతములు (ఎగుడు దిగుడులు), ఒక మృదుత్వమూ, రంగూ కనుపిస్తవి. చర్మ స్థితి గోచరిస్తుంది. కంటిలో కనుపించే భాగములూ, నోటిలో కనుపించే భాగములూ, శరీరంలో ఒంపులూ, ఉబ్బులూ, తరుగులూ ఇంకా ఎన్నో కనుపిస్తవి. ఆధునిక పరీక్షాపరికరములు లేనినాడు వీటిని పరిశీలించే వైద్యులు రోగనిర్ణయం చేసేవారు. ఆరోగ్యస్థితిలో మానవదేహాన్ని పరిశీలించినవారికే అనారోగ్యస్థితిలో మార్పులు గమనించడం సాధ్యం అవుతుంది. శరీరోపరిభాగవిజ్ఞానం ప్రతివారికీ చాలా అవసరం. ముఖ్యంగా తల్లులకు మరీ అవసరం. ఈ విజ్ఞానాన్ని ఇంగ్లీషులో "సర్ఫేస్ ఎనాటమీ Surface Anotomy) అంటారు. సర్ఫేస్ ( Surface ) అంటే ఉపరిభాగము. ఇది బాగా ఆకళింపుచేసుకున్నవారు సాధారణ రోగనిరూపణమే చేయవచ్చును. తమ పరిశీలనాఫలితములను వైద్యుడిదృష్టిలోకి తేవచ్చును. ఇందువల్ల చికిత్స ఎంతో సులభమూ, లాభప్రదమూ అవుతుంది.

రోగనిరూపణకు సహకరించే విషయములు రెండు (1) రోగి అనుభవములు (Symptoms) (2) భౌతిక చిహ్నములు (Physical Signs)

రోగి అనుభవములు కేవలం రోగికి మాత్రమే తెలిసే లక్షణములు. కళ్లు మంటలు, తలనొప్పి, వికారం ఇటువంటివి. ఇవి రోగిమాత్రమే తెలుసుకుని వైద్యుడికో, తనకు ఉపచారంచేసేవారికో తెలియజేసేవి. కాని ఈ బాధానుభవము ముఖకవళికలలోనూ, శరీర విన్యాసములలోనూ, సాధారణంగా తెలుస్తుంది. అది గమనించినవారు కొంత వరకు రోగివైఖరికి కారణములు తెలుసుకోవచ్చును.

కాని కడుపులో లివరు పెరగడమో, స్ప్లీను పెరగడమో, కొద్దిగా కడుపు ఉబ్బరించడమో, కండలు శుష్కించడమో పరీక్షచేసినప్పుడుగాని తెలియదు. పరీక్షించి తెలుసుకునే శరీర భేదములు "చిహ్నములు. ( Signs )"

రోగులు రెండు రకములు. బాధాకరంకాని మార్పులను అదే పోతుందిలే అని నిర్లక్ష్యంచేసేవారు. మూత్రం పచ్చగా పోతున్నదని వారు గమనించరు. తమ చేయి ఒణుకుతున్నదని మొదట్లో తెలుసుకోలేరు. కొందరు నిద్రపోతున్నప్పుడు తప్ప మిగతా అన్నికాలాలలోనూ శరీరంలో ఏమి మార్పులు జరుగుతున్నవో గమనించి, అది ఎందుకు జరుగుతున్నదో తెలుసుకుని, అది లేకుండా పోయేదాకా హంగామాచేస్తేవారు. ఈమాదిరి మనుషులు ప్రతి చిన్నవిషయం పెద్దదిచేసి, నిజంగా ప్రమాదకరమైన విషయాలను గమనించరు. అన్ని వ్యాధుల్లోనూ భౌతికచిహ్నములు కనిపించవు. అందుచేత వ్యక్తిగతములయిన అనుభూతులూ పరిశీలనవల్ల గ్రహించే వైపరీత్యములూ రోగనిరూపణలో చాలా ముఖ్యమైనవి.

ఏ వ్యాధినిరూపణకయినా కొన్ని ముఖ్యవిషయములు గమనించితీరాలి. నోరు, పెదవులు, దంతములు, చిగుళ్లు, నాలుక, అంగిలి. ఫేరింక్సు (Pharynx) లలో కలిగే ప్రతి మార్పునూ గమనించడం అవసరం. వీటిని గురించి ఆయా విషయములను చర్చిస్తున్నప్పుడు వివరించేను. నోటిలోనుంచి వచ్చే వాసన రోగనిరూపణలో చాలా సహకరిస్తుంది. ఊపిరిలోనుంచి దుర్వాసన వచ్చినప్పుడు రోగిచేత కేవలం ముక్కుద్వారానూ, కేవలం నోటిద్వారానూ ఊపిరి ఒదిలేటట్టు చేస్తే దుర్వాసన నోటిలోనుంచి వస్తున్నదో ముక్కులోనుంచి వస్తున్నదో తెలుస్తుంది. నోటిలోనుంచి వచ్చే దుర్వాసన దంత వ్యాధులవల్లా క్రిమిదోషానికి గురిఅయిన టాన్సిల్లవల్లా ఊపిరితిత్తులలో ఏర్పడ దర్వ్యాధులవల్లా, ఏర్పడుతుంది.

రోగి మింగలేనప్పుడు ఎక్సురేపరీక్ష చేస్తే అందులో ఆటంకమేమయినా ఉన్నదేమో తెలుస్తుంది. 40 సంవత్సరములు దాటినతరువాత మింగడం కష్టమైతే వెంటనే పరీక్షచేసి చూడడం అత్యవసరం.

ఉదర పరీక్ష (Examination of Abdomen):

ఉదరం ముందుభాగంలో మూడు రేఖలు ఉన్నట్లుగా ఊహించి, వాటినిబట్టి లోపల అంగముల ఉనికిని నిరూపించడం వైద్యసాంప్రదాయము. ప్రక్కటెముకలకు స్టెర్నము క్రింది కొనను కలిసిన చోటినుంచి భగపీఠము (Mons Pubis) వరకూ ఒక గీతలాగా వెంట్రుకలు మొలిచి ఉంటవి. వయసుమళ్లినవారిలో వెంట్రుకలు లేకపోవచ్చును.

—53 వ పేజీ చూడండి



# ప్రపంచప్రముఖులు-12

ఈ నెలాఖరుకి ఆసియాలో ఒక కొత్త 'దేశం' అవతరించబోతోంది. సింగపూర్, సారవాక్, బ్రిటిష్‌బోర్నియో, బ్రూనెయ్‌లు మలయాతో కలిసి 'మలయాసియా' అవుతాయి. సుమారు కోటిజనాభాతో, కామన్‌వెల్త్‌లోకెల్లా పెద్ద పెట్రోలు ఉత్పత్తితో, ప్రపంచంలోకెల్లా ఎక్కువ రబ్బరు, టిన్ను ఉత్పత్తి కలదేశాలలో ఒకటి కాబోతున్న మలయాసియాకి మంచి భవిష్యత్తు ఉందనటంలో అతిశయోక్తి లేదు.



మలయాలో 'స్వదేశీ' ప్రజలకన్నా వలస వచ్చి స్థిరపడిపోయినవారి సంఖ్య ఎక్కువ! అందులోనూ చైనాజాతివారి సంఖ్య బాగా అధికంగా ఉంది. భారతదేశంనుంచి వచ్చి ఉండిపోయినవారితో కలిస్తేగాని తక్కిన 'మలయన్'లు వీరి సంఖ్యను మించలేరు. రెండవ ప్రపంచయుద్ధానంతరం కమ్యూనిస్టులు మలయాని వశపరచుకోవాలని చూశారు. ఇంచుమించు ఒక దశాబ్దంవరకూ మలయాలోని చైనాజాతివారు, చాలామంది కమ్యూనిస్టులవైపే మొగ్గారని చెప్పవలసివస్తుంది. కాని ఇటవల మాత్రం, చైనాలోని దుస్థితుల వల్లనేమో, ఈ ప్రదేశాలలోని చైనాజాతివారంతా తాము ఉంటున్న ప్రాంతీయాభిమానాన్ని చూపటం ప్రారంభించారు. [సింగపూర్ ప్రధానమంత్రి శ్రీ లీకువాన్‌యూ నాయకత్వంక్రింద అక్కడి చైనా జాతివారందరూ మలయాసియా సిద్ధాంతాన్ని హృదయపూర్వకంగా స్వీకరించారని దృఢంగా చెప్పవచ్చు.]

మలయాసియాకి కామన్‌వెల్త్ దేశాల సహకారం పూర్తిగా లభించిందంటే దానికి ముఖ్యకారణం మలయా ప్రధానమంత్రి శ్రీ తుంకూ అబ్దుల్ రెహమాన్. ఈయన మొదటినుంచీ కామన్‌వెల్త్‌పట్ల తన విశ్వాసాన్ని తెలుపటమే కాక మలయాసియా నిర్మాణం విషయమై చాలా కృషిచేశారు.

ప్రస్తుతం మలయాలో తొమ్మిదిమంది 'సుల్తాన్'లు ఉన్నారు. వీరిలో ఎవరైనా దేశం మొత్తానికి అధిపతిఅయ్యే అవకాశం ఉంది. కాని ఈ అధిపతి అధికారం ఇంచుమించు మన రాష్ట్రపతి అధికారంవంటిదే. ప్రధానమంత్రి వేరే ఉంటాడు.

మలయాసియాకూడా ఇటువంటి పద్ధతినే అవలంబిస్తుందని ఊహించవచ్చు. ఇప్పటి తొమ్మిదిమంది బదులు పన్నెండుమంది సుల్తాన్‌లు ఉంటారేమో. ప్రపంచమంతటా చీలికలు ఏర్పడుతున్న సమయంలో శ్రీ తుంకూ అబ్దుల్ రెహమాన్ నాయకత్వం క్రింద జరుగుతున్న ఈ ఏకీకరణ హర్షించదగ్గది. ★

నీతిచంద్రిక

# చిత్ర ఖేదము

సుకుమార్



(గతసంచిక తరువాత)

“చూడండి—నేనుకూడా చాలా అవస్థలు పడుతున్నవాడినే. ఈఇండస్ట్రీలోసగానికి సగం మంది పన్లులేక బాధపడుతున్నవాళ్లే. మీరొచ్చి ఇంకా రెండునెల్లే అయింది. అసలు సంవత్సరాల తరబడి ఈ ఊళ్లో ఉంటున్నవాళ్ళున్నారు. వాళ్లల్లో కొందరు ఇవాళ్టివరకూ మొహానికి రంగు వేసుకోలేదంటే ఆశ్చర్యంలేదు! ఏం చేస్తాం అమ్మా! పేరుకు పెద్దదే యీ చిత్రపరిశ్రమ! ఉన్న నిరుద్యోగులంతా ఇందులోనే ఉన్నారు. ఈ పరిశ్రమలో సగానికి సగం ఖేదమే! ఆంధ్రదేశంలో కాస్త నటుడు, నటి అనిపించుకున్నవాళ్ళంతా ఇక్కడే ఉన్నారు. కొంతమందికి అవకాశాలు కలుగుతున్నాయి, కొందరికి లేవు. ఐనా మీరు తొందరపడి ఎందుకని వచ్చేశారు? సులభంగా దొరకనిదాన్నే సినిమా ఛాన్సు అంటారు. మీలాగానే, వెనక ఒక అబ్బాయి మద్రాసు వచ్చి ఖేదపడి—బాధలుపడ్డ వైనం చెబుతా వినండి” అని ప్రారంభించాను.



“మహామంత్రి తిమ్మరుసు” రంగారావు.

“ఆఅబ్బాయిది ఏలూరో, ఒంగోలో, శ్రీకాకుళమో నాకు జ్ఞాపకంలేదు. వాళ్ల ఊళ్లో బాగా నాటకాలు ఆడినవాడుట. ఆ నాటకాలు చూసినవాళ్ళు అతన్ని సినిమాల్లో చేరమన్నారుట. ఇంకేముంది—ఆ సలహాను జేబులో వేసుకుని, ఆ అబ్బాయి మద్రాసు జేరాడు. ఇంటినుంచి తెచ్చుకున్న నాలుగు డబ్బులూ ఉన్నాయి గావును—హొటల్లో దిగాడు. అతని ఉద్దేశం ఏమిటి — వారం రోజులలో తాను ఎక్కడైనా బుక్కవుతానని! అందుకని వారం రోజులకు సరిపడే గ్రాసం తీసుకొచ్చాడు. మద్రాసులో ఉన్న నిర్మాత లందర్నీ చూశాడు. తాను ఎంతటి మహా నటుడో, తన ఊళ్లో తనకు నటునిగా ఎంత పేరుందో అవన్నీ చెప్పాడు. వాళ్ళు మామూలుగా అన్నట్టే ‘చూదాం’ అన్నారు. ఆ అబ్బాయి కనిపించిందీ— నిర్మాతలూ వాళ్లూ వెయ్యి కళ్లతో కొత్తవాళ్లకోసం ఎదురు చూస్తూ ఉంటారూ, తనవంటి నాటకానుభవం గలవాడైతే, కావలించేసుకుని వేలకువేలు పోసేసి బుక్ చేస్తేరూ అని! అదేం జరక్కపోయేసరికి, తికమక పడ్డాడు. వారంరోజులూ ‘లైటిల్స్’లా తిరిగిపోయినై. ఇంక ‘కథ’ ఎట్లా ప్రారంభమవుతుందో అతనికి అర్థంకాలేదు. హొటలు ఖాళీ చెయ్యాలి. ఖాళీచేస్తే ఎక్కడి కెళ్లాలి? ఏంవేసుకుని తినాలి? ఎట్లా? అని మథన పడ్డాడు. తెలిసినవాళ్లెవరేనా ఉంటే, వాళ్ల యిళ్లకు పోవచ్చు ననుకున్నాడు. ఎవరుంటారు? హొటల్లో ఉన్న సామాన్లు తీసుకుని బయల్దేరాడు. ఒక ప్రొడక్షన్ ఆఫీసుకొచ్చి—తాను ఫలానా అని, ఏదో పనిమీద వచ్చానని, ఆ రాత్రికి ఉంటానని బతిమాలుకున్నాడు. వాళ్ళు జాలిపడి ఉండమన్నారు. ఆ రాత్రి అక్కడ ఉన్నాడు. మర్నాడు వెళ్లాలంటే ఎక్కడికి వెళ్తాడు? ఆ రాత్రిలోగా తాను ‘బుక్’ అవనా, దివ్యమైన భవనంలోకి వెళ్లిపోనా అనుకొన్నాడు. అక్కడో రెండురోజు లున్నాక, వాళ్ళు అడిగారు. తానింకా బుక్ అవాలనీ, కాగానే వెళ్లిపోతా నన్నాడు. లేకపోతే వాళ్లనే బుక్ చేసుకోమన్నాడు. ఈ వ్యవహారం వాళ్లకు చిరాకెత్తి, పెట్టే బేడా బయట పారేశారు. అతను మళ్లీ తిరిగాడు. ఇంకెవరూ రానివ్వలేదు. ఆకలి వేస్తూ ఉంటే, ఆ సరుకులు కాస్త ఎక్కడో అమ్మేశాడు. అవీ ఐపోయినై. ఇంటికి రాస్తే అక్కణ్నుంచి వచ్చేదేమీ లేదు. ఆఖరికి చింకి గుడ్డలూ, చీకిపోయిన జుట్టుతో కొన్నాళ్ళు తిరిగాడు. వాళ్లనూ వీళ్లనూ అణా బేడా ముష్టెత్తాడు. ఎక్స్‌ట్రా వేషాలైనా వేస్తానంటే, దానికీ అనుభవం కావాలన్నారు. ఆవిధంగా ఆ కుర్రాడు ఈ ‘ఎండమావుల్ని’ చూసి, భ్రమించి—నానా అవస్థలూ పడి, శాడ్‌సాంగ్స్ పాడుకోటానికి కూడా శక్తి లేనంత నీరసించిపోయాడు! ఆతర్వాత ఏమయ్యాడో నాకు తెలీదు. ఎవరింట్లోనో నౌఖరుగా కుదురు

— 49వ పేజీ చూడండి



# చాకలివాడు

బి. విద్యాసాగర్

ఆఫీసుకు టైమవుతున్నది. గబగబా భోజనం చేసి, గుడ్డలు మార్చుకుందామని పెట్టె తెరిచాను. ఒక ప్యాంటు, షర్టు తీసి తొడుక్కుందామంటే, వాటికి చిరుగులు ఉన్నాయి. మరొక జత తీసి చూసినా, అవీ అలాగే ఉన్నాయి. నాకు ఒళ్లు మండిపోయింది. ఈరోజు ఆఫీసుకు పోవాలంటే, మాసినబట్టలే వేసుకు వెళ్లాలి ! అంతకంటే గత్యంతరం లేదు. ఈరోజు అయినా చాకలి వాడు బట్టలు తీసుకువస్తాడని ధైర్యంగా ఉన్నాను. కాని వాడు రాలేదు. చెప్పినరోజున బట్టలు తీసుకువస్తే, వాడి గొప్పతన మేముంది ?

మా చాకలివాడితో చాలా ఇబ్బందిగా ఉంది. గుడ్డలు వేస్తే, పదిహేను రోజులుదాకా తీసుకు రాడు. అదయినా, వాడింటిచుట్టూ పదిసార్లు ప్రదక్షిణచేస్తే కానీ రావు .... వాడిపేరు నారాయణట ! వాడు భగవంతుడు అయితే, వాడింటి చుట్టూ ప్రదక్షిణ చేస్తే కొంత పుణ్యం వస్తుంది. కానీ వాడు వట్టి సామాన్యమానవుడు.

నేను, ఆ క్రిందటిరోజు ఆ నారాయణ ఇంటికి వెళ్లి రేపు బట్టలు తీసుకురమ్మని గట్టిగా చెప్పి వచ్చాను. అయినా తీసుకురాలేదు. అదే నా బాధ !

గత్యంతరంలేక ఆరోజు మాసిన బట్టలతోనే ఆఫీసుకు వెళ్లాను. లోగడ ఒకసారి 15 రోజుల దాకా చాకలి బట్టలు తీసుకురాలేదు. నాకు వళ్లు మండి, వాడింటికి వెళ్లి కేకలేసి వచ్చాను. కానీ నా కేకలు, దబాయింపులు వాడిమీద ఎటువంటి ప్రభావం కలిగించినట్లు లేదు. ఈ జీవితం ఒక సినిమాలాంటిదైతే, నిముష నిముషానికి, వాడింట్లో నేను ప్రత్యక్షమయి, ఆ నారాయణకు గట్టిగా వినిపించేటట్లు 'పవర్‌ఫుల్' డైలాగులు చెప్పి వాడి చేత భరతనాట్యం చేయించేవాడిని. లేదా, నేనొక మాంత్రికుడినయి వుంటే, "ఔరా ! నీ కెంత సాహసం !" అని ఒక్కసారి 'విలన్' లాగా కొర కొర చూసి, వాడు హడిలిపోయేటట్లు చేసి, వాడి చేత, నాపని ముందు అయిపోయేటట్లు చేయ

—47 వ పేజీ చూడండి







వనితావాణి,
ఆంధ్రసచిత్రవారపత్రిక,
7, తంబుచెట్టివీధి,
మద్రాసు-1

## భార్యాభర్తల మధ్య పొరపొచ్చాలు

శారదగారు వ్రాసిన భార్యాభర్తలుమధ్య పొర పొచ్చాలు వ్యాసం చదివాను. చాల బావుంది.

బి. సత్యవతి (మిర్యాలగూడ)

*  *  *

పద్మగారు ఎంత గ్రాడ్యుయేట్ అయినప్పటికీ, భర్తదగ్గర వారి మనస్సునుబట్టి ప్రవర్తింపలేక పోయినారు. భర్త మనస్సునుబట్టే ప్రవర్తించి నట్లు అయితే ఆవిడకు అంత బాధ ఉండేదికాదు. ఆవిడకు, "నా మనస్సుపట్టి నా భర్త ఎందుకు నడవకూడదు" అనుకుంటేఎప్పుడూ మనస్సు స్తిమితము ఉండదు. అందుకని, ఆవిడ ఎప్పుడైతే భర్తమనస్సు బట్టి వెళ్ళుతారో ఆరోజునుండి వారిద్దరు చాల సంతోషముతో ఉండగలరు.

మాోటేటి శారద (ఓ.యు.బి.)

*  *  *

వ్యాసం చదివినతరువాత మా దాంపత్యంలోవున్న ఆప్యాయతలోపం తొలగినది. సోదరి శారద ఉప దేశం అనుసరించి జీవితం సుఖమయం చేసుకోవా లని నిర్ణయించుకున్నాను. ఇతర సోదరీమణులు కూడ అనుసరించి దాంపత్యజీవితం సుఖమయం చేసుకుంటా రని ఆశిస్తూవున్నాను. "గృహిణీ గృహ ముచ్యతే."

బి. దమయంతి (పర్లాకిమిడి)

*  *  *

జీవితం అనే బండికి భార్య, భర్త రెండు చక్రాల లాంటివారు. వారిని కలిపే బంధం ఇరుసువంటిదని పోల్చితే బాగుండునేమో!

అన్నపూర్ణ (జయపూర్)

*  *  *

పద్మలాటి వనితలు ఈ లోకంలో సహజం. అయినప్పటికీ గోరంతలు కొండంతలుచేసి, వాస్త వానికి దూరంగా విమర్శించుట ఏమంత బాగుండ లేదని నా అభిప్రాయం.

కె. నిర్మలాదేవి (తుంగభద్రా డాం)

*  *  *

సంసారమున్నతరువాత భార్యాభర్తలమధ్య అనేక గొడవలు రావచ్చు. కానీ, ఇందులో ఎక్కువ బాధ్యులు స్త్రీలే. కనుక భార్యా, భర్తలమధ్య వచ్చే తగువుల్లో స్త్రీలు సద్దుకొనిపోయి, భర్త ఇష్టాను సారముగా నడుచుకొనిపోతే తగువులు రావు. కాని, కొందరు స్త్రీలు పురుషులపట్ల అట్లు ప్రవర్తించ లేరు. భర్త ఆఫీసునుండి విసుగుతో ఇంటికి తిరిగి వచ్చేసరికి, భర్తని భార్య తన కింటిలో పనివల్ల ఎంత చికాకుగా ఉన్నప్పటికీ, అవన్నీ మరచిపోయి, సంతోషముతో భర్తకు సదుపాయములన్నీ చేస్తే, భర్త తన ఆఫీసులోని విసుగంతా మరచి పోయి, భార్య ఆదరణకు సంతోషించుతాడుకానీ ఇంటికి రాగానే భార్యఅదరణ లేకపోతే ప్రతీ పురుషునకు ఆఫీసులోని చికాకే కాకుండా, ఇంట్లో అనాదరణతో మరికొంచెము చికాకు ఎక్కువ అవడానికి ఎంతేనా అవకాశమున్నది. ఇటువంటి సమయములందు భర్త తన భార్యమీద దెబ్బలాడినా, ఒకరిమధ్య ఒకరికి వాగ్వివాదములు పెరిగి, మాటకుమాట అనుకో వలసి (వచ్చును) వస్తుంది. కనక స్త్రీలు ఎంతేనా ఇటువంటి పొరపొచ్చాలు కలుగకుండా ఉండు టకు ప్రయత్నము చేయవలెను. కానీ, చాలా మంది స్త్రీలు భర్తలపట్ల ఇట్లు నడుచుకొన లేరు. భర్త ఆఫీసునుండి రాగానే గొప్పవాళ్ళయితే ఏవంటవాళ్లో, పనివాళ్ళోవుంటే వారే మొగవారికి కాఫీ, టిఫినూ తెచ్చిఇస్తారు. అది భర్త తినవల సిందేకానీ, భర్త పరిస్థితులను భార్య అర్థము చేసుకోదుకదా! కర్మంజాలి భర్త ఎప్పుడేనా మంచి నీళ్ళు అడిగితే వినిపించుకోనట్లు ఊరుకొంటారు కొందరు. స్త్రీలు ఇటువంటి స్త్రీలు చాలామంది ఉన్నారు. కానీ, ఇదెంతమాత్రము మన భారత నారీ మణులకు తగదనుకొంటాను. (అందరు స్త్రీలూ ఈ విధముగా ఉన్నారని నేను అనడములేదు) భర్త ఆరి కముగాగాని, మరే ఇతర చికాకులుతోగాని బాధపడి చికాకుపడుతున్నపుడు భార్య, భర్త కనుగుణంగా ప్రవర్తించి మంచిమాటలతో భర్త మనస్సునకు శాంతి చేకూర్చి, వారితో సహకరించినచో భార్య యొక్క గొప్పతనమును భర్త గ్రహించి, చాలా సంతోషించడమేగాక, తన కిటువంటి భార్య దొరు కుట తన అదృష్టమని సంతోషించుతాడు. కనుక భార్య ఎప్పుడూ భర్తతో తగువు తెచ్చుకోకుండా భర్తకి ఎదురాడకుండా తన సహనమునుచూపి, భర్తకు తన మంచి సలహాలనిచ్చి ఎల్లవేళలా భర్తతో తనూ సహకరించి, చిరునవ్వు నవ్వుతూ భర్త కను సన్నలలో మెలిగిన, ఆ కుటుంబములో భార్యా భర్తల మధ్య తగువులు రావని నా ఉద్దేశ్యము. భర్త కూడా తన భార్య ఎడల మంచిగా ప్రవర్తించి, ఏ పని చేసినా ఇద్దరూ కలిసి ఆలోచించుకొని పనిచేస్తే సంసా రము బాగుపడుటేగాక, వారి కుటుంబములో ఎటువంటి తగవులూ రావు. అంతేగాని, భార్య ఇరు వదినాలుగుగంటలూ నగలు లేవని, బట్టలు కొన లేదని (చూసిందల్లా) ప్రతి చిన్నవిషయానికి సాధించుతుంటే పురుషునికి ఇల్లే నరకమువలె ఉండి, ఆఫీసు వదిలినా ఇంటికి వచ్చుటకు మనస్కరించదు. కనుక స్త్రీ భర్తను ఎంతేనా గౌరవించుట తన విద్యుక్తధర్మమని తలంచి, భర్తను ఆదరించ వలెను.

ఇంక భర్తల విషయము. కొందరు భర్తలు తమ భార్యలు కేవలము తమకు చాకిరీ చేయడానికే ఉన్నారనుకొని, వారిమీద ఆపేక్షా, ఆదరణ చూపక కేవలము దాసీ(వాళ్ళ)లవలె చూస్తారు. అలా కాకుండా భర్తకూడా తన భార్య ఎడల మంచిగా ప్రవర్తించి నచో, భార్య ఎంతైనా సంతోషిస్తుంది. కొందరుభర్తలు కేవలము సంపాదనలేక (ఉద్యోగము పురు పురుషలక్షణము అన్న సంగతి మరచిపోయి) భార్యా, పిల్లలను పోషించలేక సతమతమౌతూవుంటారు, కేవలము వారు సంపాదించలేక, చదువుకోకకాదు. అయినప్పటికీ వారు సంపాదించక తమ అప్రయోజ కత్వాన్ని బయటపెట్టుకొంటారు. అటువంటి భర్తలను జూచి, భార్య ఎంతో క్షోభిస్తుంది. కనుక, భార్యా భర్తలిద్దరూ ఒకరి నొకరు అర్థము చేసు కొని, ఒకరి కొకరు తీసిపోకుండా ఎవరి పనులు వారు నిర్వర్తించుకొని మెలగితే వారిద్దరిమధ్యా ఎటు వంటి పొరపొచ్చాలు వచ్చుటకు అవకాశముండ దనుకొంటాను.

దురిశేటి శేషకుమారి (అనకాపల్లి)

*  *  *

'శారద'గారు "అల్లుళ్ల అలుక" లాంటి వ్యాసముల వ్రాయకుండ ఇటువంటి మంచి వ్యాసము అందరికి ఉపయోగపడే వ్యాసము వ్రాసినందున వారికి నా అభివందనములు. భార్యాభర్తలమధ్య పొరపొచ్చాలు రావటానికి కారణాలు చాల బాగా విపులీకరించినారు. నా మాట వినాలి నామాటే నెగ్గాలి అని అనుకోవటముకంటె ఇప్పటి రోజు

లలో భర్తలు చెప్పినట్లు నడచుకోవటము మంచిది.

యం. సుభద్రా బలరామదుర్గరాజు (చెరుకుమిల్లి)

* * *

"దాంపత్యంలో అన్యోన్యత లోపించాక ఏమి చూచుకొని బ్రతకాలి—గానుగెద్దులా బరువు జీవితాన్ని ఈడ్చటంతప్ప" అని పద్మ శారదగారిక్క చెప్పిరి. కష్టములు కలకాలముండవన్న సంగతి తెలిసియుండిన అలా యనుట పొరపాటంటాను. మంచిరోజు లొస్తాయని ఆశతో జీవించాలిగాని, నిరుత్సాహపడరాదు—

భర్త చెప్పినట్లు నడచుకొంటే వాళ్ళ కాపురం ఒడుదుడుకులులేక, ప్రశాంతముగా సాగిపోతుంది. అందుకనే భార్యాభర్తలు దాంపత్య శకటానికి రెండు చక్రాలని నుడివిరి. ఎంతయో అనుభవజ్ఞురాలయిన శారదగారి ఈ వాక్యం నన్నెంతో ఆకర్షించింది. అట్టి సంసారం స్వర్గతుల్యం. పుణ్యంకొద్దీ పురుషులు — దానంకొద్దీ బిడ్డలు లభించుతారని అంటారు పెద్దలు.

మరియు బండి ఇరుసు ఎలాంటిదో అటువంటి దీ దాంపత్యం" అని వక్కాణించిరి. బండి ఎగుడు దిగుడుగా పోవుచుండినచో కొంతకాలానికి ఇరుసు దెబ్బతింటుంది. అలాగానే భార్యాభర్తల అభిప్రాయాల్లో వైరుధ్యం కనపడితే దాంపత్యం అనే ఇరుసు బలం తగ్గిపోయి, సంసారం పురోగమించదు. అట్టి సంసారం నరకతుల్యం—యదార్థ విషయాలను ఉదాహరణ సహితంగా స్పష్టీకరించినందులకు రచయిత్రిగారిక్క అభివందనము—వీరి అభిప్రాయములతో ఏకీభవించుచుంటిని.

కొందరు మగువలు తమ భర్తలను తమ చెప్పుచేతల్లో పెట్టుకుని పెత్తనం చెలాయించేవారిని — భార్యలను హీనంగా చూచు మగవారిని నే చూచితిని. ఈ వ్యాసం చదివాక, వారల దాంపత్య శకటాన్ని సక్రమమైన పంథాలో ప్రశాంతంగా నడుపుకొంటూ, సంసారాన్ని స్వర్గతుల్యం చేసికొంటారని మనవిచేయుచుంటిని.

కె. కామేశ్వరమ్మ (పాలవ్రరు)

## ఆడవారూ—ఆచారాలు

వ్యాసం కొంతవరకు వాస్తవమే అనిపించింది. కాని, ఆచారంకోసం పిల్లల్ని చదివించకుండా ఉంచేవారు ఇంకా ఉన్నారంటే చాలా ఆశ్చర్యంగాఉంది. ఇలాటివారు ఇంకా ఉన్నారంటే అది చాలా శోచనీయం. ఇది నిజమైన విషయమేనా? లేక రచయిత్రి వ్యాసంకోసం సృష్టించిన విషయమా? తేలకుండాఉంది. ఏమైనప్పటికీ వ్యాసం చాలవరకు ఉపయుక్తము కాగలదనిపిస్తున్నది. మరొక్క విషయం. పల్లెటూరిపిల్లల్ని చేసుకోవటంవలన వారు "మామగారితో ఢీ అంటే ఢీ" అంటున్నారు. అని రచయిత్రి వ్రాశారు. కాని, ఇది చాలా విరుద్ధమైన విషయంగా కన్పడుతున్నది. ఇంకా చదువుకున్నవారు అలా తయారయినారు అని వ్రాసినా, ఏకగ్రీవంగా ఒప్పుకోవచ్చు. పాపం అమాయకులైన పల్లెటూరి పిల్లల్ని అనవసరంగా నిందించారనిపిస్తున్నది. ఆచారాలనే పట్టుదలలను, కాలానుగుణంగానూ, పరిస్థితుల కనుగుణంగాను మార్చుకోవాలన్న ఆవిడ అభిప్రాయం నాకెంతో నచ్చింది.

కుమారి అందుకూరి బుల్లిపున్నమ్మ
(విడుబ్రోలు)

* * *

'ఆడవారూ, ఆచారాలూ' వ్యాసం, రచయిత్రి శ్రీమతి పి. యల్. చెన్నకేశ్వరీదేవిగారు చాలా స్ఫూర్తి భావంతో విమర్శనాత్మకంగా వ్రాశారు. వారికి నా ధన్యవాదాలు.

పి. నిర్మల (వాల్తేరు)



ఇదీ వరస—8

సుందర్

నీకు రెకమెండ్ చెయ్యటానికి నాకేం అభ్యంతరం లేదు గానీ..! అబ్బాయ్..! ఆ గదిలో అటు చూడు— మా ఆవిడ వుంటుంది — వెళ్ళి ఆమెను నాకు పర్మిషన్ ఇవ్వమని ప్రార్థించు. అదొకటి కనక కష్టపడి తెచ్చావా— మరి ఆపైన నీకు...

# పరిశుభ్రత

ముత్తుముల్లి సుశీల

సాధారణంగా విదేశీయులు ఎవరైనా ఈ దేశం రాగానే ఇక్కడివాళ్ళు—ముఖ్యంగా పత్రికా విలేఖరులు—అడిగే మొదటి ప్రశ్న "హౌడు యులైక్ ఇట్ హియర్?" (ఇక్కడ మీకెలావుంది) లేక, "వాట్ డు యు థిన్క్ ఆఫ్ అమెరికా?" అని. అనేక దేశాల నుంచి ఇక్కడికి తరుచూ ఏదో ఒక డెలిగేషన్ వస్తూనే ఉంటారు. అలాగే ఒక జపాన్ డెలిగేషన్, డెన్మార్క్ నుంచి ఒకడెలిగేషన్ వచ్చినపుడు విలేఖరులు వాళ్ళని పై ప్రశ్నలు అడిగారుట. జపాన్‌నుంచి వచ్చినవారు అమెరికన్ పట్టణాల పరిశుభ్రత తమను చాలా ఆకర్షించిందనీ, డెన్మార్క్ డెలిగేషన్ ఈ పట్టణాలు చాలా అపరిశుభ్రంగా అసహ్యంగా ఉన్నాయనీ చెప్పారుట. ఈ వార్త పత్రికలో చదువుతుండగా నాకు మనదేశపు పట్టణాల స్థితి వెంటనే జ్ఞాపకం వచ్చింది.

తూర్పుఖండాలు—అంటే ఆసియా, ఆఫ్రికా ఖండాలలో ప్రాచీన సంస్కృతికి ప్రఖ్యాతిగాంచిన అనేక దేశాలు ఉన్నాయి. ఈ దేశాలన్నీ అనేక రంగాలలో అభివృద్ధి సాధించినా, ఒక్క విషయంలో మాత్రం సిగ్గుపడవలసినంతగ వెనకబడి ఉన్నాయి. అది మన పల్లెల, పట్టణాల అపరిశుభ్రత, ఇతర దేశాలను గురించి వినటమేకాని, మనదేశంలో ముఖ్యమైన నగరాలన్నీ నేను కళ్ళారా చూశాను. ఈనాటికీ అప్పుడప్పుడు ఇక్కడ టెలివిజన్‌లో చూస్తూనే ఉన్నాను. పెద్ద పెద్ద పట్టణాలే ఇలా ఉంటే, చిన్నఊళ్ళెలాఉంటాయో మనకి తెలిసిందే.

శుచిత్వానికి సంబంధించినంతవరకూ పూర్వపు పరిస్థితు లెలాఉండేవో మనకి అంతగా తెలియదుకాని, ప్రస్తుత పరిస్థితులు మాత్రం చాలా అధ్వాన్నంగా ఉన్నాయని చెప్పకతప్పదు. ఈ విషయాన్నే విదేశస్థులు అంటే మన కెంతో అవమానంగా ఉంటుంది. మనం ఒకసారి కళ్ళువిప్పి నలువైపులా చూస్తే, ఎటువంటిఅశుచిమధ్య మనజీవితాలు గడుపుతున్నామో తెలుస్తుంది. బయట ఎలా ఉంటే ఏమి మన ఇళ్ళు లోపల చాలా శుచిగా ఉంటాయని అనవచ్చు. కానీ, అది అంతగా గర్వించవలసిన విషయంకాదు. ఇంటి శుభ్రత వ్యక్తిబాధ్యత అయితే, ఊరి శుభ్రత సమిష్టి బాధ్యత.

మనదేశంలో పెద్ద పెద్ద పట్టణాలలో కూడా పరిశుభ్రత గగనకుసుమంగానే ఉంటున్నది. పాత ఢిల్లీలో కొన్ని ముఖ్యమైన వీధులు చెత్తా చెదారంతో నిండివుండటం నేను కళ్ళారా చూశాను. ఢిల్లీ మురికివాడలను గురించి శ్రీ కృష్ణగారు అప్పుడు వ్రాసే వ్యాసాలు మీరూ చదివేఉంటారు. తెల్లవారిలేస్తే వందలకొద్దీ విదేశీయులు వచ్చిపోయే మన రాజధానీ నగరపు స్థితి ఇది. "సిటీ బ్యూటిఫుల్" అనుకునే మద్రాసునగరంలో ఒక ఉదాహరణగా ఊరికంతకీ, పెద్దదీ, ఊరిమధ్యలో ఉన్నదీ అయిన కొత్వాల్‌మార్కెట్, దానిచుట్టుపట్ల రోడ్లు చూస్తే భూతలనరకం వేరే లేదనిపిస్తుంది. బొంబాయి మిగతా ప్రదేశాలకన్నా శుభ్రంగావున్నా అక్కడ కూడా మాతుంగా మార్కెట్‌వంటి అపరిశుభ్ర ప్రదేశాలు లేకపోలేదు. కలకత్తా Nightmare City of India అని ప్రధాని నెహ్రూ కూడా అన్నాడని, ఆ పట్టణ పరిస్థితులు ఇక్కడవాళ్ళు హేళనగా చెప్పుకుంటారు.

మహానగరాలే ఇలాఉంటే చిన్న పట్టణాల సంగతి చెప్పనక్కరలేదు. ఉమ్ములు (కొన్నిచోట్ల తాంబూల మిళితమైనవి) మల మూత్రాలు (మనుష్యులవి మాత్రమేకావు—పశువులు, కుక్కలు, పందులు సరే—తిరుపతిలాంటిచోట్ల కోతులు కూడా) విచ్చలవిడిగా తిరిగే వరాహాలు, గాలితో ప్రయాణంచేసే సెంటుపోగులు, పుల్లాకులు, టెలిఫోను, ఎలెక్ట్రిక్ స్తంభాలకి సున్నపు మరకలు—ఇత్యాదులు మన పట్టణాలకి సర్వసాధారణమైన అలంకారాలు. వీటన్నిటికీ కీలకస్థానాలు కొన్ని ఉన్నాయి. మార్కెట్లు, రైల్వేస్టేషన్లు, బస్‌స్టాండులు, వీట్ల పరిసర ప్రాంతాలు. జన సంచారం ఎక్కువగాలేని వీథుల వంటి ప్రదేశాలు, విజయవాడవంటి "పెద్ద" పట్టణాలలో కాలవగట్లు, నదీతీరాలు కూడా పై లిస్టులో కలపవలసివుంటుంది. కొనిచోట్ల పవిత్రమైన దేవాలయ పరిసరాలు కూడా ఇంత అశుచికి లోనై ఉండటం ఎంత శోచనీయమైన, లజ్జాకరమైన పరిస్థితి! దాదాపు ప్రతిఊరినిండా కనపడే దుర్గంధ భూయిష్టమైన మురుగుకాల్వల సంగతి చెప్పటానికి వీలులేదు. వీటికితోడు ముష్టివాళ్ళు, వాళ్ళు సృష్టించే గలీజు ఉండనేవుంది. వీటన్నిటికీ తోడు బస్సులు కార్లవెనుక అరమైలుదూరం దుమ్ము లేపే కంకరరోడ్లు ఇటువంటి పరిస్థితులలో బతికే మనని పాశ్చాత్యులు "వెనుకబడినవార"ని (అండర్ డెవలప్డ్) అంటే ఆశ్చర్యంగానీ, అవమానంగానీ ఏమీలేదు.

ఈ పరిస్థితులని బాగుచేసేందుకు మనం తీసుకోవలసిన చర్య ఏమిటి? కేవలం మునిసిపాలిటీలనీ, స్థానికాధికారులనీ దుయ్యబట్టటం మాని, ప్రతి వ్యక్తీ పౌర ధర్మాన్ని, బాధ్యతనీ గుర్తించటం ఈ సమస్యా పరిష్కారానికి ప్రథమ సోపానం.

ఉదాహరణకి వీథుల పరిశుభ్రతనే తీసుకుందాం. ప్రతివీథికీ కొన్ని చెత్త డబ్బాలనూ, వీథులను ఊడ్చేందుకు పనివారినీ, ప్రతి మునిసిపాలిటీ ఏర్పాటు చేస్తుంది. ఈ సదుపాయాలని మనం సద్వినియోగం చేసుకుంటున్నామా అనేది ప్రశ్న. తమ వాకిలి ఊడ్చి ప్రక్కయింటి దగ్గర పోగుచేయటం, ఇల్లు ఊడ్చిన చెత్త రోడ్డుమీద పోయటం, చిత్తు కాగితాలు, విస్తళ్ళు, పనికిరాని ప్రతివస్తువూ రోడ్డుమీదికి విసరటం తరుచు ప్రతివాళ్ళూ చేసే పనులు. ఒకవేళ చెత్తడబ్బా వాడుకోవాలనే సదుద్దేశం ఎవరికైనా కలిగినా, దానికి ఒక గజం దూరంలో ఉండగానే ఆ ఉద్దేశ్యం మారిపోయి చేతిలోని చెత్తని అక్కడినుంచే డబ్బాలోకి విసర బుద్ధి అవుతుంది. ఫలితం, అది గురితప్పి బయట పడటం, గాలికి వీథిఅంతా పడటం జరుగుతుంది. ఇంట్లోనే ఒక బుట్టగాని, పాత డబ్బాగానీ పెట్టుకుని పారవేయవలసిన వస్తువులన్నీ అందులోవేస్తే రోజు కొకసారిగానీ, రెండుసార్లుగానీ దానిని బయట చెత్త డబ్బాలో వేసిరావచ్చు. ఇందువలన ప్రతిసారీ చెత్తడబ్బా దగ్గిరికి నడిచే శ్రమ తప్పుతుంది. ఇంకొక విషయం, రోడ్డు ఊడిచే పనివాళ్ళుండగా వాటి శుభ్రతను గురించిన తాపత్రయం మన కెందుకు అనుకోకూడదు. పనివాళ్ళకి మునిసిపాలిటీ స్వంత సొమ్ము ఏమీ ఇవ్వదు. మన దగ్గర వసూలు చేసే పన్నులనుంచే వాళ్ళకి జీతాలు ఇస్తారు. రోడ్లు ఊడిచే పని లేకుండా మనం చేయగలిగితే ఆ పని వాళ్ళ కిచ్చే జీతాలని (అంటే మనం కట్టే పన్నులని) మరోవిధంగా సద్వినియోగం చెయ్యవచ్చు. ప్రతి వీధిలో ఉండేస్త్రీలు వాలంటీరుదళాలు ఏర్పాటు చేసుకొని ఆవీథి శుభ్రతకి బాధ్యత వహించటం, నియమాలను పాటించనివారిని శిక్షాపాత్రులను చేయుటం వంటివి పరిశుభ్రతను కాపాడేందుకు కొన్ని సూచనలు. మేము మనదేశంలో ఉండగా, పక్క వీథులలో ఉండేవారు గేదెలనూ, ఆవులనూ మా ఇంటిముందర కట్టేసి (కిటికీలకి) మాకు దోమ లొస్తున్నాయనీ, గలీజుగా ఉన్నదనీ, అక్కడ కట్టవద్దంటే "పబ్లికురోడ్డుమీద నీ పెత్తనమేమిటమ్మా! చేతనైతే మీ ఇంటిసీడ రోడ్డుమీద పడకుండా చేసుకో"మనేవారు. ఈవిధమైన మనస్తత్వాలని మార్చటం ఎంత శ్రమతో కూడిన పనో నాకు తెలుసు. ఇది కూడా వాలంటీర్లు చేయవలసినదే కాని మరోవిధంగా సాధ్యం కాదు. (సశేషం)




NGB/8B-TEL

**ఇదంతా ఎలా?** నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంకులో సుశీల డబ్బు దాచుకున్నది. మొదట 5 రూపాయలతోనే ఆ బ్యాంకులో సుశీల సేవింగ్స్ ఖాతా ప్రారంభించుకుంది. ఆమె డబ్బు సురక్షితంగా వుండడమేగాక పాలీనా నూటికి 3 రూపాయలు వడ్డీకూడా లభించింది. ప్రతి నెలా ఎంత మిగుల్చుకొనగలిగితే అంతా ఆ బ్యాంకిలో సుశీల దాచుకొనేది. కాగా కొద్దికాలంలోనే అది పెద్ద మొత్తమైంది. ఆమె తెలివైనది. భవిష్యత్తుకు, తన కుటుంబానికి, మున్ముందు సౌఖ్యం అనుభవించడానికిగాను ఆమె దాచుకొనడం ప్రారంభించింది.

## మీ కుటుంబంకొరకై డబ్బు దాయాలని మీ రెన్నడైనా ఆలోచించారా?

# నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్ లిమి.,

యునైటెడ్ కింగ్‌డమ్‌లో ఇన్‌కార్పొరేట్ చేయబడింది – మెంబర్ల బాధ్యత పరిమితం

బ్రాంచీలు: మద్రాసు: 3, నార్త్ బీచ్ రోడ్డు; 378 నేతాజి సుభాస్ చంద్రబోస్ రోడ్డు, (లాయెడ్స్ బ్రాంచి): 6, ఆర్మీనియన్ స్ట్రీట్; 158, మౌంట్ రోడ్డు. హైదరాబాద్: అబీద్ రోడ్.



'ఇది నా శరీరము—ఇది నా జ్ఞాపకార్థము' అని రొట్టెను తిన శిష్యులకి జీసస్ పంచిపెట్టాడు.

సినిమాకథ :

# కింగ్ ఆఫ్ కింగ్స్

## జరిగిన కథ

రోమన్ సైనికులు జెరూసలేంను ఆక్రమించిన కాలంలో జోసెఫ్, ఆ భార్య మేరి బెత్లెహాం చేరారు. పశువుల పాకలో జీసస్ జన్మిస్తాడు. ఆ శిశువును సంహరించేందుకు జెరూసలేం రాజు హిరాడ్ ప్రయత్నించగా జోసెఫ్ మేరీలు ఈజిప్టుకు పారిపోయి, అంటిపస్ రాజ్యానికి వచ్చాక జెరూసలెంకు తిరిగివస్తారు.

రోమన్లను విప్లవవాదులెదిర్చి ఓడిపోతారు. ఆత్మప్రబోధం వల్ల జీసస్ ఎడారి ప్రాంతాలలో గడిపి వస్తాడు. సలోమి, హిరాడియాలు తమ పాపాలను ఎత్తిచూపుతున్న బాప్టిస్టు జాన్ తల తీయిస్తారు. జీసస్ అనేక అద్భుత కృత్యాలు చేస్తాడు. గలీలీ కొండలలో జీసస్ చేసిన ఉపన్యాసం చాలామందిని నిరాశతో నింపుతుంది. సాబత్ పండుగనాడు నగరంలో రోమన్లపై దెబ్బతీయాలని విప్లవకారుడు బరబ్బాస్ నిశ్చయించుకుంటాడు.

లూయిస్ వీళ్ళ ఊహాపోహలను ఎప్పుడో పసిగట్టాడు. ఈ కుట్రదారంతా ఇలాంటి పండగసమయంలోనే తిరుగుబాటు చేయాలని చూస్తారనీ, వాళ్ళ రహస్యస్థావరాలు, ఆయుధాగారాలు కనుక్కునేందుకు ప్రయత్నిస్తున్నాననీ కూడా చాలా కాలం క్రిందటే పిలేట్ కు చెప్పాడు. అందుకే పండగ రోజున నగర సంరక్షణకూ సమరానికీ కూడా తన సైన్యాన్ని సమాయత్తం చేశాడు.

* * *

పండగ దినాల సంబరాలతో జెరూసలెం అంతా ముస్తాబై ఉత్సాహంతో ఊగిపోతోంది. దూర గ్రామాలనుంచి ప్రజలు ఆ పండుగ వేడుకలు చూసేందుకు వచ్చారు. జనమంతా పండుగ జరిగే ఆలయం వద్దకు చేరారు. ఎక్కడ చూచినా ఒకే అరుపులు, ప్రార్థనలు, గంటల మోత కోలాహాలం.

ఊరేగింపు ఏకేశ్వరుని సంబంధమైన హిబ్రూ మంత్రాలు పఠిస్తూ దేవాలయ ముఖ్యద్వారం

—45 వ పేజీ చూడండి

# ఉత్తరాప్రాయణం

వై. రామకృష్ణారావు



ఎడిటర్జీ,

కొల్లేటి చాంతాడులాంటి ఉత్తరం వ్రాయక తప్పటంలేదు మరి! ప్లీజ్ .... చిన్న సహాయం చేయగలనంటే చెప్తాను. చెప్పండి! చేస్తారా! ఏమైనా నా పూర్వాపరాలు చెప్పటం నా విధి!......

నేనూ, మా భాస్కరం (ఉరఫ్ రావు) ప్రాణ మిత్రులం! ఎలాగయ్యారయా? అంటే చెప్తా వినండి! వింటున్నారుగదూ! మేమిద్దరం పుట్టి నప్పట్నించీ ఒకే ఇంట్లోఉంటూ, ఒకే కంచంలో తింటూ, ఒకే మంచంమీద పండుకొంటూ అన్న దమ్ములమల్లే .... మెలగకపోయినా, సెకెండ్ ఫారంలో స్నేహం కలసినప్పటినుంచీ కలసి చదువు కుంటూ వచ్చాము. అంటే ఇప్పటికి ఏడేళ్ల క్రితం నుండీ మిత్రులం! 'సంబంధంబు సాప్తపదీనంబు' అని హరవిలాసం పార్వతీకళ్యాణఘట్టంలో చదివి నట్లు జ్ఞాపకం! ఏడడుగులు కలసి నడచినంతనే బంధుత్వమేర్పడేపక్షంలో, ఈ ఏడేళ్లలోనూ మేమి ద్దరం కలిసి నడచిన వేలాది అడుగుల్ని తలచు కొంటూ మేమిద్దరం ఆప్తబంధువులంకూడా అనుకొంటుంటాను. బహుశః నిజంకూడా ఇంతే నేమో! ఇప్పు డీసొద అంతా దేనికయా? అంటే ఇంతటి ప్రాణమిత్రుడని నాచేత చెప్పబడే రావుగాడికి ఒకవిషయంలో బుజాపజాలు కావలసి వచ్చాయి. దేనికి? అన్నది ప్రశ్న. మా ఇద్దరికీ ఉన్న స్నేహంమూలాన వాడు సెలవుల్లో స్వగ్రామం వెళ్లినపుడు మా ఇద్దరిమధ్యా తరచు ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూండేవి. మచ్చుకి కొన్ని చదవండి!

రాజమండ్రి,
7—6—'61

డియర్ రావ్!

సెలవులు దాదాపు ముగియవస్తున్నాయి. నీవు ఇక్కడినుంచివెళ్లి దాదాపు నెలకావస్తున్నా నీదగ్గర్నించి ఉత్తరాలు లేవు. కనీసం ఒక్కకార్డు ముక్కైనా వ్రాయలేదు. బహుశః జ్ఞాపకం ఉండిఉండను!

"గొంది" పల్లెటూరుగదూ! ఆ వాతావరణం నీకు సరిపడి ఉండచ్చు. దూరపుకొండలు నునుపు గదూ! నాకుకూడా అలాంటిచోటికి వెళ్లి ప్రకృతి

—41 వ పేజీ చూడండి


ప్రేమ కానుక
12




మర్నాడు
ప్రొద్దున్నే
తీసుకుని
మున్సబు
గారింటి
కి బయ
లుదేరారు.


రోడ్డుమీద వెకిలి వేషాలే కాకుండా వీళ్ళు మనఇంటికి కూడా వస్తారేమిటి?!!!


ఎవ్వరు కావాలండి?
నువ్వు మాట్లాడరా, నాకు భయంగా ఉంది.


మున్సబుగారు ఇంట్లో ఉన్నారాండి
లేరండి... అలా వెళ్ళారండి.


గుడ్.. ఐతే పర్వాలేదు... చూడండి, మీ


అసలు మావాడి ధైర్యాన్ని మెచ్చుకోవాలి, నిన్న
దొంగలు మీతమ్ముణ్ణి ఎత్తుకుపోతూంటే వీడు తనప్రాణాలకి కూడ లెక్క చేయకుండా, ఆ దొంగల్ని తన్ని, మీతమ్ముణ్ణి రక్షించి తీసుకు వచ్చాడు


జాగ్రత్తగా ఉంచుకోండి



### భగ్ననేత్రాలు

"నువ్వు ఆలోచించుకొనే ఈ మాట అంటున్నావా పార్వతీ!" అన్నాడు శశికాంత్ బాధగా.

పార్వతి ముఖకవళికలు మారాయి. గంభీరముద్రవహించింది. శశికాంత్ ప్రశ్నకు జవాబివ్వకుండా శూన్యంలోకి చూస్తూ వుండిపోయింది కొంతసేపు.

"మాట్లాడవేం పార్వతీ!" శశికాంత్ కంఠస్వరంలో ఉద్వేగం స్పష్టంగా గోచరించింది.

"హుం! ఏం మాట్లాడాలి? నాకూ ఆశయాలు కొన్ని ఉంటాయని గ్రహించడం మంచిదనుకుంటాను." పార్వతి స్వరం కంపించింది. ఆమె హృదిలోని భావపరంపర అనూహ్యం అయింది శశికాంత్‌కి. నిశ్చలంగా ఆమెవైపు చూశాడు. భ్రుకుటి బిగించిన పార్వతి చెప్పుకుపోతోంది: "నా ఆశయాలెటువంటివో ముందే చెప్పినట్లు జ్ఞాపకం. నాతోబాటు వాటికికూడా మీ హృదయంలో తగిన స్థానం యిచ్చారని ఆశించాను! నమ్మాను! నా ఆశ అడియాశ అయినదని గ్రహించటాని కింతకాలం పట్టింది ...."

ఆ గదిని మౌనం ఆవరించింది. సాయంకాలపు ఎండ బయట వృక్షాగ్రాలమీద సన్నగా పడి హృదయాలను గిలిగింతలుపెడుతోంది. శశికాంత్ నిట్టూర్చి తలుపువైపుకి దారితీశాడు.

గడపమీద కాలు ఉంచి మరొకసారి పార్వతివైపు తిరిగి, "అత్యవసరం శ్రేయస్కరం కాదని గుర్తించగోరుతాను. సావకాశంగా తర్కించుకుని నీ వైఖరి మార్చుకోగలవేమోననే ఆశ నేనింకా వదులుకోలేదు. మించిపోయిందేమీ లేదు. కావలిస్తే కబురు చెయ్యవచ్చు ...." అని భారంగా అడుగులో అడుగు వేసుకుంటూ అక్కడినుంచి నిష్క్రమించాడు.

పార్వతి కిటికీవద్దకు వెళ్లి నుంచుంది. ఈ సంఘటన పరిణామా లెటువంటివో ఆమె ఊహించలేకపోలేదు. కాని హృదయాన్ని కఠినం చేసుకుని దృఢనిశ్చయానికి వచ్చింది. ఆమె స్మృతిపథంలో

ఒరేయ్... ఒరేయ్! అదేమిట్రా? వాణ్ణలా చావ బాదుతున్నావ్?

అబ్బే మరేం లేదు నాన్నా...! ఇవ్వాళ మా మేస్టారు 'బాలానాం రోదనం బలం' అంటే అర్థం ఏమిటో చెప్పారు.. అందుకేని తమ్ముణ్ణి ఏడిపించి బలంగా చేస్తున్నా!

సుందర్




"ప్రతిబింబం అలా వుందేం ?"

ఆలోచనలు లీలగా మెదిలాయి. గతమంతా సినిమా రీలులాగా గిర్రున తిరిగింది. వర్ణనాతీతమయిన ఆవేదన ఆమెను ఆవరించింది. నేత్రాలు అశ్రుపూరితాలయ్యాయి. మౌక్తికములవంటి బిందువులు మందంగా చంపమీదుగా దొర్లాయి .....

"ఏమిటి పార్వతీ ఆలోచనాసముద్రంలో మునిగిపోయినట్లున్నావే ? శశికాంత్ ఎక్కడ ? ఇంతకుముందే అతని కంఠస్వరం ఆలకించినట్లు జ్ఞాపకం ? ఏమి టీ మౌనముద్ర ! కించిత్ శోకం వచ్చినట్లుందే ?" ఊపిరి సలుపకుండా రజని వేస్తున్న ప్రశ్నలకు సమాధానమివ్వలేక పార్వతి ఉక్కిరిబిక్కిరి అవుతోంది.

"నాతో చెప్పవా పార్వతీ ?" అన్నది రజని సానునయంగా పార్వతిభుజంమీద చెయ్యివేస్తూ. పార్వతి గాఢంగా నిట్టూర్చి ఆమెవైపు తిరిగింది. అప్పటికే గదిలో సంధ్యాకాంతులు నిండుతున్నాయి. వాటి ప్రభావమేనేమో పార్వతి కనుకొలకులలో అరుణ రేఖలు విరిశాయి.

"క్షమించు రజనీ ఇవాళ నా మనసేమీ బాగులేదు" అన్నది గంభీరంగా.

"మనస్సులోని బాధ ఇతరులవారితో చెప్పుకుంటే కొంచెం ఉపశమనం లభిస్తుందేమో !" అని జవాబిచ్చింది రజని లాలనగా.

"నిజమే, ఎంత అమూల్యమైన సలహా నీది ! రజనీ, నా గుండెలలో అగ్నిపర్వతాలు ప్రబద్ధలవుతున్నాయంటే నమ్ముతావా ? చెప్పు రజనీ చెప్పు !"

"పిచ్చి పార్వతీ ! ఈ కర్ణపుటాలు నీ మొర ఆలకించటానికే ఆతురతతో ఎదురుచూస్తున్నాయ్! మన పవిత్రస్నేహానికి ఎటువంటి అవరోధాలూ రాకూడదు. చెప్పు వింటాను."

"నీ మనస్సెంత స్వచ్ఛమయినది రజనీ ...." అన్నది పార్వతి ఆవేశంతో.

రజని నయనాలు సానుభూతితో మెరిశాయి. "నగ్నసత్యాన్నయినాసరే ఆలకించేందుకు సిద్ధమని వేరే చెప్పక్కరలేదనుకుంటాను...."

గదిలో అంధకారం పులుముకొనడం ప్రారంభించింది.

"నా స్వభావం నీకు తెలుసు రజనీ. ఎటువంటి స్వల్పవిషయమయినా తీవ్రంగా తీసుకునే అలవాటు నాకుందని నీకు విదితమే ! నా ఆశయాలకు, ఆశలకు అవరోధాన్ని సహించలేను. సాయంసమయాలలో విశ్రాంతి అవసరమని నా అభిమతం.

"నేత్రోత్సవమయిన వేడుకను మించినది వేరే లేదని అంగీకరిస్తావా రజనీ ! చెప్పు రజనీ చెప్పు !"

"ముమ్మాటికీ నీతో ఏకీభవిస్తున్నాను" అన్నది రజని జాలిగా.

"కొందరి అభిరుచులు వేరు. నేత్రోత్సవంకన్నా ఉదరపోషణమే వారి హృదయాలలో అగ్రస్థానం ఆక్రమిస్తుంది ......"

"నిజంగా సృష్టి విచిత్రమయినది. అందుకనే 'లోకోభిన్నరుచిః' అంటారు !" రజని కంఠస్వరంలో సానుభూతి ఉట్టిపడుతోంది.

ఆమె ఆదరణ పార్వతిని కదల్చివేసింది. కంపించే అధరాలతో, "నా ఆర్తనాదం ఆలకించే ఆప్తురాలివి నువ్వున్నావు ! అదే చాలు, ధన్యురాలిని రజనీ ! ఈరోజు రవి కళాకేంద్రానికి వెడితే బాగుంటుందని నే ననుకున్నాను. కళారాధన నా ఆశయాలలో మొదటిదని నీకు విదితమేకదా ! అయినా అన్నపూర్ణ విషయమే పట్టించుకునేవారూ కొందరున్నారని నేడే గ్రహించాను. నాకు కనువిప్పు ప్రసాదమయింది."

పార్వతి ఇక మాట్లాడలేకపోయింది. దుఃఖంతో ఆమె గొంతుక పూడుకుపోయింది. ముఖాన్ని రెండు చేతులతో కప్పుకుంది.










చిత్రకారుడు: జయదేవ్.

"ఎంతపని జరిగింది! నీకె ఇలా అవుతుందని విన్నటికీ ఊహించలేదంటే నమ్ము పార్వతీ—నువ్వు మొదటి ఆట సినిమాకి వెడదామంటే, కాదు కాఫీ హోటలుకే వెళ్లాలని శాసించే కఠినాత్ములున్నా రని విని దుఃఖిస్తున్నాను. నాకూ కనువిప్పు ప్రసాద మయింది ....." రజని గొంతుకలో ఏడుపు అణు ముకోలేక పోయింది .......

"పద్మశ్రీ" (తటాకపురం)

## చేర్చుకోండి జాబితాలో...

కవుల జాబితాలో
కలుపుకోండి 'నన్ను'
శాసంతో, కూసంతో.
కదపగలను 'పెన్ను'
సంస్కృతముతో నాకు
సంబంధము లేకున్నా
వాడుక భాషలోన
వ్రాయు 'శక్తి'తో నున్నా
ప్రబంధాలు చాలమార్లు
పట్టుదలతో చదివాను
ప్రజలకొరకు అంత భాష
పనిలేదని వదిలాను.
ఛందస్సుతో, వృత్తాలను
కందాలను వ్రాశాను
వ్రాయగలనా? లేదా? అని
వ్రాసికొన్ని చూశాను.
యతిప్రాస లెన్నో నేసి
ఆటలెన్నో ఆడించా
'హాయ్‌హాయ్' అనుటకొరకు
అంత్యప్రాస జోడించా
పద్యాలకు విలువకొంత
'పడిందని' తెలుసుకొని
పాడుకునే పాటలకే
మంచి విలువ కలదు అని
సినీమా పాటలుగా
చిన్నవెన్నో వ్రాశాను
వందపుటల కాపీలు
భద్రముగా దాచాను.
ఇంతవరకు నా కవితను
ఎవరు చదువలేదు మీరు.
ఇకనైనా చేర్చుకోండి నన్ను
ఈ గేయము చదివిమీరు

వాణి (హైదరాబాద్)

## ట్రాజెడీలో కామెడీ!

ఒక కంపెనీవారు నూతననటిని పరిచయం చేస్తూ ఒక బహిరంగనాటకాన్ని ప్రదర్శించారు. ప్రేక్షకులు ఇసుకవేస్తే రాలకుండా క్రిక్కిరిసి పోయారు. ట్రాజెడీకాబోలు చాలా విషాదముగ నడుస్తున్నది కథ. ప్రేక్షకులు మొదట్లోనే నూతననటిని తెగ పొగిడేస్తున్నారు. ఒక దృశ్యంలో ప్రియుడు, తలకు బాగా గాయాలుతగిలి పడి వున్న ప్రేయసినిచూచి దుఃఖాక్రాంతుడై "ప్రేయసీ! నే నీ దృశ్యముగాంచ శక్యముగాకున్నది. నిన్నీవిధ ముగా చేసిన దుర్మార్గులెవరో చెప్పు...." చాలా ఆత్రంగా అడిగాడు. పాపం! హీరోయిన్ తనపోర్షన్ మర్చిపోయింది గాబోలు తికమకపడకుండ వెంటనే "ఇంకెవరు ప్రియా! ఆ మేకప్‌మ్యాన్ మంగయ్య లేడూ వాడే...." అంటూ ఒరిగిపోయింది. ఇంకే ముంది అంతవరకు కన్నీరు చిందిస్తున్న ప్రేక్షకులు కాస్తా గొల్లుమన్నారు.

బి. రంగనాథ్ (మద్రాస్) ★



చిత్రం: ఎల్. లక్ష్మయ్య (మదనపల్లె)

# గంభీరమూర్తి సత్యనారాయణ

పెద్దవాళ్ళు వద్దంటున్నా వినకుండా, మొండి కెత్తి, లాగూ పైకిలాక్కుని, చేతికందిన చొక్కా మీలో వేసుకుని. ఆ ఆరేళ్ల కుర్రాడు ఒకనాడు సాయంత్రం ఊరువిడిచి అదేపరుగు ప్రారంభించాడు! ఎక్కడికంటే, ఐదుమైళ్లదూరంలోవున్న పారుగూళ్లో నాటకప్రదర్శనం వుంది దాన్ని చూడాలని! ఆరాత్రి ఆనాటకం చూసి, ఒంటరిగా రావటానికి భయమైతే, అక్కడే పడుకుని, చీకటుండగానే లేచి, తనవూరు చేరుకున్నాడు!

సత్యనారాయణకు చిన్నతనంనుంచీ ఈ 'పిచ్చి' జోరుగానే వుండేది. చుట్టుపట్ల ఎక్కడ నాటకమైనా సరే, జట్టుతో బయల్దేరేవాడు, జట్టు ముందుగా బయల్దేరి వెళ్ళిపోయినా, అసలు రాకపోయినా ఒక్కడూ వెళ్లిపోయేవాడు! నాటకాలు చూడటంలోవున్న ఆనందం, అతనికి ఆటల్లోనూ చదువులోనూ ఎందులోనూ వుండేదికాదు మరి కొన్నాళ్లకు, అతనికి చిన్నచిన్న ఊహాలు బయల్దేరసాగాయి నాటకం చూస్తున్నంతసేపూ, అందులోని కృష్ణుడు తనైతే ఎట్లావుంటుంది? అందులోని అర్జునుడు తనువేస్తే ఎట్లావుంటుంది? ఇది సాధ్యమా? దానికి పెట్టిపుట్టాలనీ, పూజచేసుకుంటేనేగాని అవి లభ్యంకావని పెద్దవాళ్ళు కొందరు అతనితో చెప్పేవారు. తామూ రోజూ పూజలుచేసేవాడు— భగవంతుడికి మొక్కేవాడు — "ఓ దేవుడా—నేనూ నాటకం ఆడాలి. నాకోవేషం ఇప్పించవూ?" అని అడిగేవాడు. నాటకం చూసినతర్వాత, గ్రీన్‌రూములోకి ఎట్లాగన్నా దూరిపోయి, గుడ్డలు మార్చుకుంటూ, రంగులు తుడుచుకుంటూన్న 'వేల్పుల'ను కన్నార్పకుండా చూసుకుంటూ కూచునేవాడు!



కైకాల సత్యనారాయణ

27—5—'35న కవుతరం గ్రామంలో పుట్టిన సత్యనారాయణ, అక్కడే కొంతవరకూ చదువుకున్నాడు. అది అతని తాతగారి ఊరు. హైస్కూలు చదువుకోసం అతను గుడ్లవల్లేరు వచ్చాడు. 51లో స్కూలుఫైనలు ప్యాసయ్యాడు.

ఆ రోజుల్లోనే, అతను ఒకనాటకంలో వేషం వేశాడు. ఆ నాటకంపేరు 'ప్రేమలీల' ఇది అతని మొదటినాటకం. అతనిస్వప్నం ఫలించిన ఆరోజున, అతని ఆనందానికి మేరలేదు. నాటకం ఐపోయిన తర్వాత, "బాగా చేశావురోయ్" అన్నారు. మిత్రులూ, పెద్దలూ తను వేషమైతే వెయ్యాలనుకున్నాడు గాని— 'బాగాచెయ్యటం' ఏమిటి? — ఐతే తను నాటకాలు వెయ్యవచ్చునన్నమాట! 'ప్రేమలీల' నాటకం అతనికో మెడలూ, ఉషారూ ఇచ్చింది. అక్కడినుంచి అతను వీలుదొరికినప్పుడల్లా— నాటకాల్లో పాల్గొనేవాడు.

స్కూలుఫైనలు చదువు ఐపోయిన తర్వాత సత్యనారాయణ, గుడివాడ కాలేజీలో చేరాడు. రెండుసంవత్సరాలు అతను కాలేజీ నాటకాల్లో 'ఉత్తమనటుడు'గా వచ్చాడు! 55లో అతను బి. ఏ. డిగ్రీ తీసుకున్నాడు!

బి.ఏ. పట్టా పుచ్చుకున్నతర్వాత 'ఏంచెయ్యాలి?'' అనేప్రశ్న వచ్చింది. ఆ ప్రశ్నకు సమాధానం ఆలోచించుకుంటూనే అతను రాజమండ్రిలో తన తండ్రిగారు చేస్తున్న కలపవ్యాపారంలో ప్రవేశించాడు. కాలేజీలో చదువుకుంటున్నప్పుడు, సత్యనారాయణ కాలేజీ నాటకాల్లోనే కాకుండా, ఇతర చోట్లకూడా నాటకాలు ఆడాడు. ప్రభాకర నాట్యమండలిపేరుతో చాలా ఊళ్లల్లో ఆడిన 'పల్లెపడుచు'లో నటించాడు

చిన్నతనంలో నాటకాలు చూస్తున్నప్పుడు ఆవేశంల్లో తానుంటే ఎట్లా ఉంటుందనే ఊహ కలిగినట్టే, కాలేజీస్టూడెంటుగా వుండగా—సినిమాలు చూస్తూంటే, నెమ్మది నెమ్మదిగా అవే ఊహలు మళ్లీ కలగసాగాయి ఐతే నాటకంలో నటించటం వీలయినట్టు, సినిమాలో వీలుకాదనికూడా అతను అనుకున్నాడు

సత్యనారాయణకు కె. యల్. ధర్ అనే స్నేహితుడున్నాడు, అతనికి మద్రాసులో ప్రసాద్‌గారి సంస్థలో ఉద్యోగం అప్పుడు ప్రసాద్‌గారు 'కొడుకులూ కోడళ్లూ' తీస్తారని అందులో ప్రయత్నిద్దామని ఆమిత్రుడు సత్యనారాయణను రమ్మని రాశాడు. సందు దొరికితేచాలు ఉడాయించాలన్న 'పట్టు'లోవున్న సత్యనారాయణ, ఒక్కవురుకలో మద్రాసు చేరుకున్నాడు; ఆ మిత్రుడిద్వారా ప్రసాద్‌గారిని చూశాడు. ఆయన 'ఆచిత్రం ప్రారంభించబోయే ముందు చూదాంలే' అన్నారు.



'నువ్వా—నేనా'లో రౌడీగా

'ఎట్లాగూ మద్రాసు వచ్చేశాముగదా, నలుగురినీ చూద్దాం' అని సత్యనారాయణ మళ్లీ వాళ్ళ ఊరు వెళ్లలేదు. పిల్లైనంతమంది దర్శకులను, నిర్మాతలను చూశాడు. కాని అప్పట్లో అతనికి ప్రయోజనం కనిపించలేదు.

సత్యనారాయణ ఆరోజుల్లో చాలా ధక్కామొక్కీలు తిన్నాడు. ఇంటిదగ్గరనుంచి కొద్దికొద్దిగా డబ్బు తెప్పించుకుంటూ మద్రాసులో కాలక్షేపం చెయ్యటం దుర్భరమైపోయింది ఉదయం లేవటం దర్శకులనూ నిర్మాతలనూ చూడటం, తన చిరునామా వాళ్ళ కివ్వటం — ఇదీ అతని కార్యక్రమం ఒక్కొక్కప్పుడు అతనికి నిరుత్సాహం కలిగేది ఎంతకాలం అని తను ఇక్కడ ఇట్లా రోజులు వెళ్లబుచ్చటం? ఎన్నాళ్లని ఈ నిరీక్షణ? తనకు సినిమా యోగ్యత వున్నదా, లేదా? ఏమైతే ఐందని అతను, మొండికేసి— వేషం సంపాయించాలనే నిర్ణయించేసుకున్నాడు.

ఒకనాడు సత్యనారాయణ కాఫీ తాగుతూవుంటే, గ్లాసులోడుగున చచ్చిన సాలెపురుగు కనిపించింది! అతనికి భయంవేసింది. తాను విషాన్ని త్రాగానని అనుకున్నాడు. 'సాలెపురుగు అపాయమైంది— డాక్టరును చూడు. అని సలహాలిచ్చారు, మిత్రులు. ఆసమయంలో అతను ఒకటే నిర్ధారణచేసుకున్నాడు. తనకు చావు రాసిపెట్టివుంటే ఆదేం తప్పించలేము. సినిమాలో నటించే యోగ్యతవుంటే, చావు వచ్చినా రాదు—అనుకున్నాడు డాక్టరును చూడకుండా, మందూ మాకూ తీసుకోకుండా అతను ఆరాత్రి

— 39వ పేజీ చూడండి

# కాశ్మీర్ బొకె టాల్క్‌తో గంటలుతరబడి సువాసనగా తాజాగావుండండి

అత్యద్భుతమైన, నాణ్యమైన కాశ్మీర్ బుకె కొన్కలు ఒక సౌందర్య టాల్క్...ఒక బేబీ పౌడరు

పూల గుచ్ఛంలోనికి చొబ్బినట్టు గావుంటుంది, కాశ్మీర్ బుకె టాల్క్ యొక్క చల్లని, పూలరేకు వంటి మెత్తదనాన్ని అనుభవిస్తే. వొళ్లు అంతా రాసుకొనండి, నవ వసంతపు ఘుమఘుమలతో రాజిల్లుతారు.



శిశువును సంతోషంగా సౌఖ్యంగా వుంచండి! కాశ్మీర్ బుకె ప్రతి యితర ప్రత్యేక బేబీ పౌడరువలె మెత్తగా, సున్నితంగా వుంటుంది. మీ ఇద్దరూ ఉపయోగించగల ఒకే పౌడరు అందు బాటులో వుండటం ఎంత వీలు!




# కాశ్మీర్ బొకె

పురుషులు వాంఛించే సువాసనగల టాల్కం పౌడరు

CB-8-19-TEL.



# సరాగమాల

## వి ఎ కె రంగారావు

రెండు సంవత్సరాల క్రిందట ఒక ఊరిలో, పల్లెగాదు, పట్టణమూగాని ఆ ఊరిలో ఉంటుండగా అపూరి అమెచ్యూర్స్ ఏదో ఒక నాటకం వేశారు. ఆ నాటకంపేరు గుర్తులేదుకాని అందులో హీరో పాత్రధారి "ఆనందమంతా అనురాగమంతా" పాడటం ఈనాటికీ గుర్తుంది. ఏనాటికీ గుర్తు ఉంటుంది. అసలు అది చాలా చక్కని పాట. సహారాయెడారిలాంటి "భలేబావ" చిత్రంలో పన్నీటిమడుగువంటిది. పాట వింటున్నప్పుడు మనసున మమతల మల్లెలు మురిసినట్లు వేయి చంద్రుల వెన్నెల విరిసినట్లు తోస్తుంది. సినిమాలో ఆ పాట పాడినది ఘంటసాల. సంగీతం సుసర్ల దక్షిణామూర్తి. రసతరంగిణియైన యమన్ కల్యాణిలో ఉన్న ఆపాట మొదట కలిగించిన మధురానుభూతిని మరల తలపింపజేశారు. తమ గాన సుధతో ఆ నాటకంలో హీరాపాత్ర వేసిన బాబారావు.

వారితో పరిచయమేర్పడినతరువాత అదే పాటను ఎన్నోసారులు అడిగి పాడించుకున్నాను. వారు తరుచు పాడుతుండే మరొక మధురగీతం "చల్లని వెన్నెలలో చక్కని కన్నె సమీపములో", "సంతానం" చిత్రంలోనిది. దీని రాగం సుమశర వేణియైన శుద్ధకల్యాణి. పైపాటకు ఈ పాటకు చాలా పోలికలు ఉన్నాయి. రెండు పాటలూ అనిసెట్టి రచనలే. రెండిటికీ యింతటి సోయగాల రాగాలు దక్షిణామూర్తి కూర్చినవే. రెండు ఘంటసాలవారి గాత్రప్రతిభచే ప్రాణప్రతిష్ఠ చేసుకున్నవే. పైగా ఈ రెండు పాటల గురించే వ్రాయమని భీమవరంనుంచి ఒకరు వ్రాశారు. మొదటి రికార్డు కాన్సెలయింది. ఇప్పుడు దొరకటం కష్టం. అయినా పెద్దా చిన్నా షాపుల్లో ప్రయత్నిస్తే, ఎక్కడో అడుగునబడి ఉంటే, కొంటామంటే సంతోషంతో తీసి యిస్తారు. రెండవపాట ట్విన్ లేబిల్‌లో ఉంది. నంబరు ఎఫ్. టి. 16283.

**డి. బి. ఆర్. గారికి :** మీరు కోరిన పాటల సాహిత్యం, "సులలిత మురళి", "అంది మయంగుదడి" వేరే పంపుతున్నాను. మొదటిది ఓఢ్రదేశపు ప్రఖ్యాత గేయం. రెండవది "పార్తిబన్ కణవు" (తెలుగులో వీరసామ్రాజ్యం) చిత్రంలో ఎం. ఎల్. వసంతకుమారి పాడినది. ఈ పాటలకు స్వరం కావాలంటే జగన్నాథపురం వాస్తవ్యులైన పిండి అప్పలదాసుగారికి వ్రాయవలసిందే. మరొక గత్యంతరం లేదు. "మంచిమనసులు", "మురిపించే మువ్వలు" సాహిత్య సంగీతాలగురించి ఆయా చిత్రాలలో పాటలగురించి వ్రాసినపుడు తెలిపాను.

**విడుద్రోలు నుంచి వ్రాసిన మిస్. అందుకూరి బుల్లిపున్నమ్మ గారికి :** "కనులకు దోచి" పాట. దానిగురించి నేను వ్రాసినది మీకు నచ్చిందన్నారు. సంతోషం. "శభాష్‌రాముడు" చిత్రంలో "వన్నెలు కురిసే చిన్నదిరా" పాటలో మధ్యనున్న మాటలన్నది ఘంటసాలవారే. మీ మూడవ ప్రశ్నకు జవాబివ్వటం సాధ్యంకాదు, పత్రికాముఖంగా.

* * *

చాలమంది పాఠకులు మంచి హిందీపాటల గురించి వ్రాయమని కోరుతున్నారు. నలుగురి నోట్లో నలిగిపోయిన పాటలను కాకుండా కాస్త తెలిసీతెలియని పాటలను పరిచయం జేస్తాము.

### కాలాబజార్ యన్. 53405

హిందీ సినిమాలలో వర్షంలో తడుస్తూ నాయికానాయకులు పాడిన పాటలు కొన్ని ఉన్నాయి. "శ్రీ 420" లోని "ప్యార్ హు ఆ" అన్నది, "సర్దార్" లోని "బర్సాకిరాత్‌మే" అన్నది. "కాలాబజార్" లోని రిమ్‌ఝుమ్‌కే తరానేలేకే ఆ ఈ బహార్" అన్నది. ఈ మూడూ మంచి ముత్యాల వంటి పాటలు. ఎన్నిసారులు విన్నా తనివితీరదు. తృప్తి కలుగదు. ఈ మూడిటిలో కొంచెం పైమెట్టు నున్నది. గీతాదత్ మహమ్మద్‌రఫీ పాడిన యుగళగీతం "రిమ్ ఝుమ్‌కే తరానేలేకే ఆ ఈ బహార్, యాద్ ఆ ఈ తేరీ మేరీ పెహ్లీ ములాఖాత్". ప్రియుడు ప్రక్కనుండగా చేతిలో చెయ్యివేసి మనస్సుకు మనస్సు నప్పజెప్పి, కళ్లలో కళ్లు కలిపి, వర్షంలో విహారంచేయటం యెంత ఆనందంగా ఉంటుంది ? ఆ ఆనందాన్నంతా ఈ పాట స్వరస్వనసమ్మేళనంలో బంధించివేశారు సంగీత దర్శకులు ఎస్. డి. వర్మన్.

ఈ పాట వెనుక ఒక చిన్న 'భాగోతం" ఉంది. "కాలాబజార్" చిత్రం కోసం నాయికా నాయకులైన దేవానంద్, వహీదా రెహమాన్ వర్షంలో నడవటం చిత్రీకరించారు. ఆ సన్నివేశంలో పాట పెట్టాలనే ఉద్దేశం లేనేలేదు. ఆ షాట్లు రషెస్ వేసి చూసుకుంటే కెమేరామేన్ వి. కె. మూర్తి ప్రతిభావిశేషాలవలన ప్రతి అడుగునా ప్రకృతి సౌందర్యం ప్రతిబింబించింది. ఆ వెలుగునీడల వింతనాట్యం ఎంత అందంగా ఉన్నా రెండున్నర నిమిషాలసేపు మాటలులేని దృశ్యం చూచి ప్రేక్షకులు విసుగెత్తుతారేమో అనుకుని అప్పటికప్పుడు, అంటే రీ రికార్డింగ్ సమయంలో, శైలేంద్ర చేత ఒక పాట వ్రాయించి రికార్డుచేసి ఆ సీనులో నేపథ్యగీతంలా ఉపయోగించారు. అందువల్లనే ఆ పాట వాళ్ళు పాడుతున్నట్లే ఉండదు. వాళ్ల అంతర్యాలు ఆలపించినట్లు, వాళ్ల హృదయాలు ఎలపించినట్లు ఉంటుంది.

రెండవప్రక్క నున్నది గీతాదత్, సుధా మల్హోత్రా పాడిన భజనగీతం "వా మై థక్ చాహూఁ" అన్నది. ఒక్క ఫ్లూట్ ఆసరాతో భగవంతుని ఆసరా కోరుతున్న భజన అది. వింటానికి హాయిగా, పాడుకోవటానికి తేలికగా ఉంటుంది.

### డిటెక్టివ్ యన్. 52660

వేసవికాలంలో వెన్నెల రాత్రుల్లో ఆరుబయట పడుకున్నపుడు, ఒకోనాడు సగంరాత్రి జరిగినాక గాలి స్థంభించిపోతుంది. ఆ ఉక్కలో చిరుచెమటలు పట్టినా, ఆ మత్తులో మెలకువరాదు. స్తంభించిన గాలి కాస్సేపయినతరువాత దాని కదే పడలుతుంది. చిరుచెమట నున్న శరీరానికి అప్పుడే వీస్తున్న చిరుగాలి సోకిందంటే, ఊహలలోని ఉద్రేకాలనే ఆలంబనగా అవతరించిన ఊర్వశి పెట్టిన చక్కిలిగింతలా, వనిత కోరి వచ్చిన వగలఅడ్డైన వలపుకాడు చూపే బలవంతమా అన్న భ్రమ కలుగుతుంది. ఆ మధురభ్రాంతి మీకు కావలసినప్పుడంతా కలగాలంటే పై రికార్డు కొని అందులో గీతాదత్ పాడిన సోలో వినండి.

ఈ పాటకు ఆంగ్లేయమాతృక "జామై కెన్ ఫేర్‌వెల్." వరస యథాతథంగా ఉంచినా మధుర సుధాభరితంగా, విధురవ్యధాజనితంగా సంగీతాను సరణను చేసినవారు సంగీతదర్శకులు ముకుల్ రాయ్. గీతాదత్ అన్నగారు. ఇంతకుముందు "సైలాబ్" మొదలగు చిత్రాలలో మరపురాని సంగీతాన్ని అందించినవారు.

ఈ వరసకు శైలేంద్ర అమర్చిన మాటలు మూర్తీభవించిన కావ్యశ్రీ. "దోచమక్‌తీ ఆంఖోమే కల్‌ఖాబ్ సునెహరా థా జిత్‌నా, హమ్ జిందగీ తేరీ రాహోంమే ఆజ్ అంధేరాహై ఉత్‌నా" అంటే "మెరిసే కళ్లతో నిన్న కనిన కల ఎంత ప్రకాశవంతమో, నేడు నీవులేని జీవితం అంత అంధకార బంధురం" అని.

వసంతాంతాన కోయిలకంఠాన పలికే విచారగీతపు వింత అందం, గీతాకంఠంలో పలుకుతున్నది. గ్రీష్మారంభాన తన ప్రేయసి మబ్బుకన్నెకోసమని వనమయూరం చేసే విరహనృత్యపు సరళులు గీతాగళాన పరవళ్ళు తొక్కుతున్నాయి. ఈ పాట ఒంటరిగా వినండి. ఈ పాట అందాన్ని సంపూర్ణంగా ఆస్వాదించటానికి ఏకాంతమూ, ఏకాగ్రతా రెండూ అవసరమే.

రెండవ ప్రక్క నున్నది గీతాదత్ మహమ్మద్ రఫీ పాడిన మరొక యుగళగీతం. "కల్ తలక్ హమ్ ఠీక్ థా ఆజ్ హమే క్యా హోగయా" అన్నది. ఈ పాటకు ఆపరాని ఉత్సాహమే లయ, ఓపలేని సంతోషమే ఛందస్సు. నిలుపరాని తమకమే పాటకు వరుస. రెండుపాటలూ రెండువిధాలైన పాటలకు అన్నివిధాలా తలమానికాల్లాంటివి. మీ డీలర్ దగ్గర లేకపోతే ఆర్డరిచ్చి తెప్పించమనండి. వచ్చిన తరువాత వినండి. ★

లాబొరేటరీలోంచి బయటికి వచ్చి హాయిగా, తనివితీరా కమ్మని గాలి పీల్చుకున్నాను. అంతదాకా ఊపిరితిత్తుల్లో నిండుకుని ఉన్న సల్ఫర్ డైయాక్సైడూ, ఈథరూ వగైరాలు కొంచం కొంచం బయటికి పోసాగాయి.

ఎదురుగా కన్పించాడు మూర్తి, ఫోర్సెప్స్‌తో పట్టుకుని ఒక పొడుగాటి కాగితంతో సహా.

"ఏం ? అయిపోయిందా ?" అని అడిగాను. తలూపాడు.

"ఇదో, ఇది అవతల పారేసివస్తా" అంటూ లోపలికి పోయాడు. మరో రెండు నిముషాల్లో ఇద్దరం బయటికి వచ్చాం. యూనివర్శిటీ బస్ స్టాప్ దగ్గర చేరాం.

"లీవు యిచ్చాడా గురుడు ?" అని అడిగాడు.

"ఊ! కాని పది రోజులే, సైన్సు కాన్ఫరెన్సు ఉందిట .... ముందుగా రమ్మన్నాడు" అన్నాను.

ఇద్దరం కాస్సేపు మాట్లాడలేదు. తర్వాత మూర్తే మాట్లాడాడు.

"నేరుగా నెల్లూరికేనా, లేక .... "

"నెల్లూరే, బందరు పోదల్చుకోలేదు ఈసారి" తలూపాడు మూర్తి.

నేను రెండు నెలలుగా ప్రయత్నించి ప్రొఫెసర్ మెహతా దగ్గర నెల రోజులకు లీవు సంపాయించబోవడం, అది ఆఖరికి పది రోజులకి దిగడం మూర్తికి తెలుసు. ఇద్దరం ఒకే స్కూల్లో, కాలేజీలో చదివాం. ప్రాణస్నేహితులం .... ప్రస్తుతం ఇద్దరం యూనివర్శిటీలో సహాధ్యాయులం .... "రిసర్చి" అనే క్రీడాభిలాషులం .... గవర్నమెంటు ప్రతి నెలా రెండువందలయాభై ఇస్తున్నన్నాళ్లూ —ప్రొఫెసరు కళ్లుతెరవనన్నాళ్లూ ఫరవాలేదు .... మూర్తివేపు చూచాను. తలవంచి, చేతులు వెనక్కి కట్టుకుని, బూటు మొనతో నేలను తవ్వుతున్నాడు. దీర్ఘంగా ఆలోచించే సమయంలో మూర్తి భంగిమ అదే ....

"నెల్లూర్లో ఎన్నిరోజు లుంటావు ?" అని అడిగాడు అలాగే.

"అన్ని రోజులూ .... ఏమయినా పనుందా ?"

"ఉహూ .... చెప్తాను పద .... "

ఇద్దరం బస్ ఎక్కాం .... మూర్తి టిక్కట్లు తీసుకున్నాడు.

"మీ నాన్నగార్ని చూసి రమ్మంటావా ?" అన్నాను.

కాసేపు మూర్తి మాట్లాడలేదు.

"బహుశా నీకు వీలుపడదేమో .... "

"మరేం ఫర్వాలేదు .... అసలు చాలారోజులయింది. పల్లెటూరి గాలి తగిలి .... పోయి, రెండ్రోజులుండి వస్తాను .... " అన్నాను నా అంతట నేనే సిద్ధమయి.

మూర్తి నిశ్శబ్దంగా తలూపాడు.

మరునటిరోజు స్టేషనులో కన్పించాడు. ఇద్దరం టీ నీళ్లు తాగాం స్టాల్లో .... బండి కదిలే టైం అయింది, కంపార్టుమెంటులో కూర్చున్నాము. గార్డు విజిల్ ఊదాడు.

"ఏం చెప్పమంటావు ?" అని అడిగాను .... నవ్వాడు ....

"చూడు—నీకు తెలీందికాదు .... మా పిన్నికి

—36 వ పేజీ చూడండి




పండుటాకు
విజయ




దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

**31-8-1962 శుక్రవారము మొదలు**
**6-9-1962 గురువారము వరకు**

**మేషం :**

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

మీరుచేయబోయే ప్రతికార్యము ఈ సమయంలో దానంతట అదే జరుగుతున్నట్లుగా ఉంటంది. ఒకప్పుడు భయంకరంగా తోచిన వ్యవహారాలు మీ జాగ్రత్తవల్ల చక్కగా పూర్తిచేయగల్గుతారు. తలవనితలంపుగా బాధ్యతతెలియని మనుష్యులవల్ల మాట అనిపించుకొనవలసిన సూచన లున్నవి. మీ మనోనిగ్రహం, న్యాయమార్గానుసరణము వీటివల్ల సంఘంలో పేరుప్రతిష్ఠలు నిలుపుకోగలుగుతారు. ఈ సమయంలో బంధువులకన్నా ఇతరులవల్లనే మేలు పొందగలుగుతారు. స్థిరాస్తుల క్రయవిక్రయాలు ప్రశాంతంగాను లాభదాయకంగాను సాగుతవి. వారం రెండవభాగంలో శుభకార్యాలు నెరవేర్చగలుగుతారు. ప్రయాణాలు సాగుతవి. వాక్చాతుర్యంతో అవతలివారిని సంతోషపరచి కార్యసిద్ధి పొందగలుగుతారు. 1, 2, తేదులలో అసౌఖ్యము, అకస్మాద్ధనప్రాప్తి.

*   *   *

**వృషభం :**

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

ఏ వ్యవహారము మీ మాటను మీరిపోదు. కాని, లెక్కచూడకుండా డబ్బు ఖర్చుచేస్తూ ముందుకు పోవలసినసమయం. గణితమూ, యంత్రసంబంధమైనపనులు వీటియందు మీ బుద్ధి చాలా చురుకుగా పనిచేస్తుంది. తోటివారికి సహాయంచేయటం నిమిత్తం విశేషబాధ్యతలను పైనవేసుకొనవలసి వస్తుంది. సుఖము, ధనాదాయము సంతృప్తికరంగా ఉంటవి. ఇతరులనుగురించి దూషణచేస్తూ మాట్లాడేవారిని నమ్మి దగ్గరచేరనీయతగిన సమయంకాదు. విలువగలవస్తువులు కొంటారు. ఈ సమయంలో జరిగే ఒప్పందాలు చాలా సంతృప్తికరంగా పూర్తి అవుతవి. ఒకటి రెండు సందర్భాలలో పెద్దవారిమాటలను త్రోసివేయవలసిన అవసరం కలుగవచ్చు. ధైర్యంతోఉండండి. పర్యవసానంలో అన్నీ సలక్షణంగా జరుగుతవి. 3, 4 లలో సంతోషవార్తలు, కార్యసిద్ధి.

> **గ్రహస్థితి**
>
> మిధునంలో అంగారకుడు, కర్కాటకంలో రాహువు, సింహంలో సూర్యుడు, కన్యలో బుధుడు, తులలో శుక్రుడు, మకరంలో శనికేతువులు, కుంభంలో గురువు, సింహ, కన్య, తుల, వృశ్చికాలలో చంద్రుడు.

*   *   *

**మిధునం :**

**(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ఎవరితో ఏవిషయం మాట్లాడినప్పటికీ ఒకరి భావాన్ని మరొకరు పూర్తిగా అర్థంచేసుకోకుండా తొందరపడటం జరుగుతూవుంటుంది. సమయంలో బంధుమిత్రులు అండగా నిలుస్తారు. మంచి సలహా చెబుతారు. ప్రత్యేకంగా అనారోగ్యం చేయదు. కాని, వేళకు సరిగా నిద్రఆహారము అందకపోవటం, ఉష్ణసంబంధమైన బాధలు తరచు సూచిస్తూ ఉంటవి. డబ్బు విశేషంగా పెట్టుబడిపెట్టటంవంటి పనులు ప్రస్తుతం లాభించవు. కుటుంబంలో ఒక బాధ్యత తీరిందని అనుకొనేసమయంలో మరొక సమస్య తలెత్తుతూ ఉంటుంది. విద్యార్థులకుమంచి సమయం. యోచనాశక్తి బాగుంటుంది. సంగీతము మొదలయిన లలితకళలయందు అభివృద్ధిపొందగలుగుతారు. పదిమందిలో గౌరవము లభిస్తుంది. సుఖం తక్కువగా ఉంటుంది.కాని బాహ్యవిషయాలలో చాలా మంచిసమయం. 5, 6 తేదులలో దుబారా ఖర్చులు, ప్రసంగాలు పాకంముదరటంవల్ల వచ్చే చిక్కులు.

*   *   *

**కర్కాటకం :**

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)**

ఇంతకుముందు కనుపిస్తున్న ఉద్రేకపూరిత వాతావరణం క్రమంగా తగ్గిపోయి చల్లగా ఆలోచించుకొనటానికి అవకాశాలు లభిస్తవి. పదిమందిలో మీ అంతస్తును మీరు నిలబెట్టుకొంటారు. అధికారులతో సంబంధించిన వ్యవహారాలు పూర్తికాకుండా మధ్య అడ్డగించేవా రుంటారు. మీరు కొంత జాగ్రత్తవహించటంవల్ల మధ్యలో చిక్కులేకుండా అనుకూలం పొందగలుగుతారు. ధనాదాయం పెరుగుతుంది. ఉత్తరదిక్కునుంచి సంతోషవార్తలు తెలుస్తవి. ధనసంబంధమైన లావాదేవీలు లాభదాయకంగా పూర్తిఅవుతవి. వారాంతంలో కుటుంబంలోనివారి ఆరోగ్యం తగ్గుతుంది. వృత్తికిసంబంధించిన కార్యక్రమాలు మార్చుకొనవలసివస్తుంది. కారణం తక్కువ, అందోళన విశేషం. 31, 1 తేదులలో పరోపకారం నిమిత్తం శ్రమ, వ్యయం. వృత్తిలో కార్యభారం.

*   *   *

**సింహం :**

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

మీరు ఒకరిమీద ఆధారపడవలసిన అవసరం ఉండదు. కోర్టుకచేరీలలో గౌరవప్రదంగా మీ కార్యం సాధించుకోగలుగుతారు. వృత్తిలో సమర్థులైన

స్నేహితులు లభిస్తారు. విద్యారంగంలో మీ కృషి చక్కగా ప్రకాశించగల సమయం. క్రొత్త క్రొత్త విశేషాలు ఊహించగలుగుతారు. కుటుంబంలో మీ విలువ పెరుగుతుంది. సుఖం పొందగలుగుతారు. ఈ సమయంలో త్రిప్పట అధికంగా ఉండవచ్చు. ఇతరుల వ్యవహారాలలో మీ శక్తిసామర్థ్యాలను ఎక్కువగా వినియోగించవలసిన అవసరం కలుగుతుంది. దైవానుగ్రహంవల్ల వృత్తి ఉద్యోగాలలో మీరు కోరుకునే మార్పులకు అనుకూలమైనకాలం. విరోధులవల్ల ఏసమయంలో చిక్కు వస్తుందోననే భావం ఒక సమయంలో తోస్తుంది. కాని, ప్రస్తుతం అటువంటిది ఏమీ ఉండదు. వారం రెండవభాగంలో వినోద కార్యక్రమాలలో పాల్గొంటారు. 2, 3 తేదులలో అధికారులవల్ల అనుకూలత, కుటుంబంలో శుభకార్యాలు.

* * *

## కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

ఒకవిధంగా మంచికాలమని చెప్పవలసి ఉంటుంది. అయితే ఏ వ్యవహారమైనా నానబెట్టుకుంటూ కూర్చోటం మంచిదికాదు. స్వల్ప కష్టనష్టాలను భరించవలసివచ్చినా తెంపుగా ముందుకు పోవలసిన సమయం. ముందు ముందు మీ స్థితి బలపడటానికి తగిన ఆరంభ లక్షణాలు కనిపిస్తవి. ఆటంకాలను లెక్కచెయ్యకుండా రక రకాల స్నేహితులను ఒక మార్గానికి తీసుకొని రాగలుగుతారు. స్థిరాస్తులవల్ల ఆదాయం వృద్ధి అవుతుంది. మీ క్రిందివారు తప్పుచేస్తున్నట్లు తెలిసినా మాటలలో బయటపడతగిన సమయం కాదు. మీ జాగ్రత్తలో మీరు ఉండటం మంచిది. వారాంతంలో "వెదుకబోయినతీగ కాళ్లకుచుట్టుకున్నట్లు"గా మీ ప్రయత్నాలు కలిసివస్తవి. శ్రమకుతగిన ఫలితం ఉంది.

* * *

## తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

సుఖము సంతోషము బాగుంటవి. దైవబలం కలిసివచ్చేసమయం. ప్రధానంగా పట్టుదల అనేది అవసరం. వృత్తిలో ఎదటివారికి సంతృప్తికలిగే పద్ధతిని అనుసరించగలుగుతారు. అందువల్ల మీ మనస్సు తేలికపడుతుంది. బుద్ధి సూక్ష్మతవల్ల ఎవరు మంచివారో, ఎవరు మోసగాండ్రో నిర్ణయించగలుగుతారు. మీ మంచితనాన్ని దుర్వినియోగంచేసిన పెద్దమనుష్యులకు తగు విధంగా సమాధానం చెప్పగలుగుతారు. ధనయోగం సంతృప్తికరంగా ఉంటుంది. మీ అజాగ్రత్తవల్ల వృథాగా నిష్ఠురాలు పడవలసివస్తుంది. అయితే వెంటనే యథార్థం తెలుస్తుంది. కుటుంబంలో సుఖం లభిస్తుంది. పనులు సకాలంలో జరిగిపోతూ వుంటవి. కోర్టుకచేరీలలో సంతోషప్రదంగా ఉంటుంది. 31, 1 తేదులలో ధనలాభం, ప్రయాణం.

* * *

## వృశ్చికం :

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

మీరు ఎంత ధారాళంగా ప్రవర్తిస్తారో మీ కార్యక్రమాలు అంత శీఘ్రంగానూ, లాభకరంగానూ నెరవేరుతవి. మాటలలో ఒకరికి తగ్గకుండా జరుపుకోగలుగుతారు. గతకాలంలోని మీ కృషివల్ల కోర్టు కచేరీలలో విజయం పొందగలుగుతారు. కుటుంబంలో జరిగే సంఘటనలు సంతోషప్రదంగా ఉంటవి. కాని, లోలోపల కారణంతెలియని బాధ మాత్రం స్వల్పంగా తోస్తుంది. వృత్తివ్యాపారాలకు సంబంధించిన లావాదేవీలలో మీ తొందరపాటువల్ల ఎదుటివారి మనస్సుకు ఆందోళనకలిగే అవకాశాలున్నవి. సాధ్యమైనంతవరకూ ఉత్తర ప్రత్యుత్తరాలలో సౌమ్యంగాపోవటం అవసరం. మానసికంగా పని పెరగటంవల్ల మీ సుఖం చెడుతుంది. 3, 4 తేదులలో త్రిప్పట, దుబారా ఖర్చులు, శుభవార్తలు.

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఒక సమయంలో ఉన్నభావం మరొక సమయంలో ఉండదు. అన్ని అధికారాలు మీచేతిలోపెట్టుకుని ఇతరుల ఆజ్ఞకోసం ఎదురుచూడవలసిన సమయం. చెయిదాటిపోయిన ధనం తిరిగిరావటం కష్టం. భాగస్తులవంటి మనుష్యులతో పేచీలు వస్తున్నా ప్రధాన కార్యాలకు ఆటంకం అంటూ ఉండదు. వ్యాపార వ్యవహారాలలో సాహసంగా ప్రవర్తించబోతారు. కాని, ప్రస్తుతం మీ మాట నెరవేరటం కష్టం. ధనాదాయం సామాన్యంగాఉన్నా మీ, విద్యాబుద్ధులను వినియోగించి సంఘంలో గౌరవంపొందగలుగుతారు. సామాన్యంగా ఆహారమునందు అయిష్టత, నిద్రాభంగము, మొదలయినాటివల్ల అసౌఖ్యం కలుగుతుంది. రక్తదోషం వల్లకూడా అశక్తత తోస్తుంది. ముందుజాగ్రత్త మంచిది. ఫలితం లభించినంతవరకు ముందు గ్రహించి తిరిగి మీ ప్రయత్నాలను సాగించవలసిన సమయం. 2,3 లలో సంఘంలో గౌరవవృద్ధి, వృత్తిలో స్వయం కృషివల్ల ధనలాభం.

* * *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

మీస్నేహితులు ఈ సమయంలో గోడమీది పిల్లివాటంలో మాట్లాడటంవల్ల మీరు తొందరపడి ఏపనిచేయటానికి తోచదు. ఆదాయం ధారాళంగా వస్తున్నట్లే ఉంటుంది. ప్రస్తుతం ఖర్చులు పెరగటంవల్ల కొరతమాత్రం తప్పదు. దైవానుగ్రహంవల్ల చిక్కుపడకుండా ఏదోవిధంగా ముందుకు పోతారు. దేహారోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. వారం రెండవభాగంలో మీ మాటకు విలువనిచ్చేవారు లభిస్తారు. ప్రయాణాలు అనుకొన్నప్రకారం సాగేఅవకాశాలు తక్కువ. ఎదటివారి మాటలలో కొన్ని చిక్కులున్నట్లు తెలుస్తున్నా విధిగా ఆచరించవలసిన అవసరం రావచ్చు. విద్యార్థులకు అనుకూలమేకాని శ్రమ అధికం. 5, 6లలో సంతోషవార్తలు, విలువగల వస్తువులు కొనటం.

* * *

### ఈ వారము ధరలు

బంగారుధర ఈవారం ఆరంభంలో తేజీ, రెండవభాగంలో కొంచెం మందీ. వెండి ధరలో కొద్ది మందీ వచ్చి నిలుస్తుంది. పసుపుకు కొద్ది గిరాకీవస్తుంది. మిర్చిధరలో మందీ సూచన లున్నవి. ప్రత్తిధర పెరుగుతుంది. వేరుశనగ పప్పుధర మొదట్లో తేజీలో ఉంటుంది. కాని క్రమంగా తగ్గే అవకాశా లున్నవి. మానెధర కొద్దిగా పెరిగి తగ్గుతుంది. మావుల ధరలో తేజీ రాగల సూచన లున్నవి.

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

గ్రహబలం బాగున్నది. మీ మాటనేర్పరితనంతో మిత్రులను సంపాదించగలుగుతారు. ఆర్థికంగా మీ స్థితి బాగుపడుతుంది. శుభసంతోష కార్యాలలో పాల్గొంటారు. వృత్తిలో పదిమందికి మంచిసలహాచెప్పి మీస్థానాన్ని బలపరచుకొంటారు. ఒకటి రెండు వ్యవహారాలలో కఠినంగా మాట్లాడవలసినస్థితి ఏర్పడటంవల్ల మనశ్శాంతి లోపిస్తుంది. అకస్మాత్తుగా దెబ్బ, గాయము మొదలయినవాటివల్ల బాధకలిగే అవకాశాలున్నవి. మిత్రులవల్ల పెద్దగా సహాయం లభించకపోయినా ప్రస్తుతం ఏపనీ ఆగిపోతుందనేభయం ఉండదు. కోర్టు కచేరీలలో ప్రత్యక్షమైన చిక్కులు రావు. కాని, మీ పట్టుదలను కొంతవరకు తగ్గించుకొనవలసి వస్తుంది. మీక్రింద పనిచేసేవారివల్ల కార్యసిద్ధి ఉంటుంది. ఉపయోగంలేని మాటలతో విసిగించేవారుంటారు. ముందుజాగ్రత్తతో యుండండి. 3, 4 తేదులలో ధనలాభం, బంధువుల రాకపోకలు.

* * *

## మీనం :

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

ముందు అనుకొనేది ఒకటి సమయంలో ఆచరించేది మరొకటి. తలవనితలంపుగా పరిస్థితులు మార్పుచెందినా మీకు కలిగే ఇబ్బంది ఏమాత్రము ఉండదు. మీ మనస్సుకు ఇష్టంలేనిపనులకు ప్రోత్సాహించేవారు ఉంటారు. మనోనిగ్రహంతో ఉండటం అవసరం. కుటుంబంలోనివారు చేసినపొరపాట్లు ఈ సమయంలో మీ మనస్సును బాధిస్తవి. వృత్తిలో పరిశ్రమకొద్దీ ఫలితం లభిస్తుంది. ఆప్తమిత్రులవంటివారితో ఎడబాటుకలిగే అవకాశాలున్నవి. అనేకవిషయాలలో మీ భారం తొలగిపోవటంవల్ల సంతృప్తికరంగా ఉంటుంది. కాని, అయినవారిమాటలవల్ల మనస్సులో భయాందోళనలుకలిగే అవకాశా లున్నవి. న్యాయమార్గంలో కార్యం సాధించుకొనగలుగుతారు. దైవకార్యాలు నెరవేరుతవి. 5, 6 తేదులలో కార్యసిద్ధి, శుభవార్త. ★

# పండుటాకు

32వ పేజీ తరువాయి

నాకూ వద్దు .... బాగున్నానని చెప్పు .... అంతే... సరేనా ?"

తలూపాను .... అంతకుముందెప్పుడూ అంత నేరుగా చెప్పలేదు....తర్వాత ఎందుకో హఠాత్తుగా అడిగాడు :

"నీ దగ్గర ఎంతవుంది ? డబ్బు—"

"అయిదు వందలు .... ఏం ? కాస్సేపు సమాధానం రాలేదు ....

"నీకేమయినా కావాలా ?" అని నేనే అడిగాను. తల అడ్డంగా ఊపాడు. 'మరేదో' ఉంది. లోపల సతమత మవుతూ పైకి, నా ఎదుట చెప్పలేక, తనలో దాచుకోలేక బాధపడుతున్నాడని గ్రహించాను ....

"మరేంలేదు .... వీలయితే మా నాన్నకి ఓ రెండు వందలు ఇచ్చెయి .... నీకు టి. ఎం. ఓ. చేస్తాను—లేకపోతే యిక్కడ యిస్తాను .... " అన్నాడు. తలూపి 'సరే' అన్నాను. చిరునవ్వుతో షేక్‌హేండ్ చేశాడు.

"ఆ, అన్నట్లు ఆయన్ని కొంచం ఆరోగ్యం, అదీ .... జాగ్రత్తగా ఉండమను .... ఈమధ్య ఏదో .... కొంచం వంట్లో .... " తలూపాను .... మూర్తి తల దించేసుకున్నాడు.

రైలు కదిలింది. మూర్తి చేయి కదుల్తూ కన్పించింది .... ఆ వెనుక, అతను గంభీరముద్ర తెరవెనుక, అతని గతం సంక్షిప్తంగా కనిపించింది.

*   *   *

మూర్తి తండ్రిపేరు శ్రీ కృష్ణశాస్త్రి. పేరు చూడగానే కనుక్కోవచ్చు--తెలుగు మేష్టారని .... అదీ, ఏదో చిన్నఊళ్లో, జీతాలురాని పంచాయితీ అజమాయిషీలో నలిగే పెంకుటిళ్ల 'హైస్కూల్లో' అని—

శ్రీ కృష్ణశాస్త్రిగారిని చూస్తేనేచాలు అసలు, ఆరడుగుల ఆజానుబాహువు, బ్రహ్మతేజస్సుఉట్టి పడేది స్ఫురద్రూపంలో. చక్కని మృదుశారీరం సమకూరగా వినసొంపుగా పద్యపఠనం ఆయనకు అలవడిపోయింది.

శాస్త్రిగారి క్లాసులో కూర్చుని ఆయననోటివెంట పారిన కవితాస్వాదనచేయని విద్యార్థి వుండేవాడుకాదు. అప్పుడప్పుడూ పాఠం వదిలేసి, మిగతాకావ్యాల్లోంచి 'మచ్చుకి' వినిపించేవారు శ్లోకాలూ పద్యాలు. విద్యార్థులు తలలూపి 'మరోటి' అనని దినంలేదు.

కణ్వాశ్రమంలోకి దుష్యంతుని ఆగమనం వర్ణించిన కవిరాజ విరాజితం లయబద్ధంగా శ్రావ్యంగా వినవచ్చేది:

"ఏచి తవర్చి తలిర్చిన తావుల నిమ్మగులేవుల..." అంటూ మరోసారి కాళిదాస కవితావాహినిలో ఓలలాడించేవారు.

"ఆషాఢస్య ప్రథమదివసే—మేఘ మాశ్లిష్టసానుం....వప్రక్రీడా పరిణతగజ— ప్రేక్షణీయం దదర్శ...." అని ఆ మేఘుడే ఉరిమినట్లు గంభీరత నింపేవారు....

శ్రీనాధుని సీసపుబరువు, పోతన నిరాడంబరత్వమూ, తిక్కన కందమూ, పెద్దన ప్రబంధమూ

ఆయన నోటినుంచి మధురాతిమధురంగా వెలువడేవి.. విద్యార్థులు ఆనందంతో అలిసిపోయేవారు విని. అర్థం కాకపోయినా అభిరుచి జన్మించేది. వెంటనే శాస్త్రిగారంటే ఆవిధంగా అందరికీ ఆప్తులయ్యారు.

స్కూల్లోనూ, మా ఊర్లోనే ఆగిపోలేదు శాస్త్రిగారి గొప్పతనం. ఆయన పీఠిక వ్రాసిన చెత్త పుస్తకాలు వేలకువేలు ఖర్చైపోయేవి. ఆయన ఆశీస్సు నందుకోని నవకవి లేడాకాలంలో. ఆయన రచనలు చదవనివారు లేరు. సంస్కృతాంధ్రపైశాచికపాళీ భాషల్లో దిట్ట యని పేరు సంపాదించారు శాస్త్రిగారు. పండిత సభల్లో పూర్వాపర సిద్ధాంతం చేయగల సమర్థులు. క్షణాలమీద ఆశుకవిత్వం చెప్పగల సరస్వతీసంపన్నులు. ఆయన లేని సారస్వతవేదిక, సంస్కృతీ సమితి ఒక్కటీ రాణించలేదు — జరుగలేదు.... ఆంధ్రావనిలో శ్రీ కృష్ణశాస్త్రిగారు తెలుగుదనానికీ తెలుగుకవితసొంపుకూ మారుపేరయి ఊరూరావెలిగారు..

ఇన్నిలక్షణాలున్న శాస్త్రిగారి పద్ధతి కాలానికి అనుగుణ్యంగా పోవడం నేర్చుకోలేదు. మూర్తిని ట్రైనింగు ప్యాసయి 'పంతులుగా' చేరమని కోరారు. తనలాగే తనకుమారుడు కీర్తివంతుడౌతాడని ఆయన ఆశ.

కానీ మూర్తి అందుకు విరుద్ధంగా, తగవులాడి బి.యస్సీ చదివాడు.. నాతోపాటు — ఇద్దరం కలిసే యం.యస్సీకూడా పూర్తిచేశాము.. ఎన్నో సంవత్సరాలయిం దిప్పటికి.

శాస్త్రిగారికి వార్ధక్యం దుఃఖాన్నే తేసాగింది. కంటిచూపు మందగించి, మతిమరపూ అలసటా హెచ్చయిపోయాయి. నలభై ఏండ్లకు ద్వితీయ కళత్రస్వీకారంచేసిన శాస్త్రిగారికీ యాభై తొమ్మిదవ ఏట నడుములువంగిన తాతగారికీ పోలిక ఎక్కడ! అపుడాయన విరబూసిన ద్రుమాను. ఇపుడు ఏళ్ళనిండి వ్రేళ్ళుసడలిన వృక్షం. ఆయన్ని చూడాలనగానే ఏదో బాధవేసింది. వయస్సు మళ్ళి జీవితంలో సంజవేళ దాటి రేయీ చీకటీ అలుముకొనే వయస్సులో, దాదాపు ఒంటరిగా, గతంలోని కీర్తి, కరిగిపోయిన దారుఢ్యం నీడల్లా సాగిపోతూవుంటే .... ఎవరికిమాత్రం మనోస్థయిర్యం వుంటుంది? తల్చుకుంటే మూర్తి మీద కోపంవచ్చింది....నెల్లూర్లోనే వుండి శాస్త్రిగారికి అండదండగా వుండాల్సిందిపోయి, ఆయన మీద పగసాధించినట్లు ఇలా తనొక్కడూ పోయిగా 'రిసర్చి' పేరిట తిరగడం నాకు న్యాయంగా కన్పించలేదు.

* * *

నెల్లూరుకుపోయిన నాలుగోరోజు మూర్తి వాళ్ళ ఊరికి పోయాను. అక్కడ శాస్త్రిగారి ఇల్లు కనుక్కునేసరికి కొంచెం కష్టం అయింది— ఇల్లు మారారుకాబోలు ఈలోపల. జాగ్రత్తగా వాకిలిముందే ఆగి చూశాను.

చిన్నపెంకుటిల్లు. ఇంటిముందు కొంచెం ఖాళీ చోటువుంది. వాకిలిముందు పెట్టినముగ్గు కొంచం మిగిలివుంది. సాయంత్రం ఆరూ, ఆరున్నర కాలేదు. కాని లోపల అప్పుడే లాంతరు వెలుగు తెలుస్తూంది.

కిటికీలోంచి ఒక ధోవతీ, పేము ఉయ్యాలా, దూరంగా లోటా కన్పించాయి. గొంతు సరి చేసుకుని పిలిచాను. ఎవ్వరూ జవాబియలేదు. మరో సారి పిలిచాను. ఎవరో వచ్చారు బయటికి. ముఖం నిండా గీతలు గీచినట్లున్నాయి రేఖలు.. పొడుగాటి ముక్కునుండి అప్పుడే పీల్చిన ముక్కుపొడివాసన తేలివచ్చింది. పాతకాలంనాటి సులోచనాల వెనుక నుంచి రెండు అంతకన్నా పురాతనమైన కళ్ళు నా మీద దృష్టి నిలిపాయి. కొద్దిగా వణుకుతూన్న కుడి చేయి చేతికర్రమీద ఆనివుంది.

"ఎవరు బాబూ?" అంది శరీరం, కించిత్ గద్గదంగా, కించిత్ గంభీరంగా ధ్వనించింది వాక్కు.

"శాస్త్రిగారు...." అన్నాను.

"ఆఁ?" అన్నారు ఒక చెవిపై చేయివుంచి. కొంచెం పెద్దగా అరిచాను.. తలూపాడు.

---

"రెండు అప్పాలు వెయ్యండమ్మా!" ఇంటిముందు ఆగిన బిచ్చగాడు కేకపెట్టాడు.

"అన్నం పనికి రాదా? అప్పాలు అడుగుతున్నావ్" ఇంటావిడ ఆశ్చర్యపోతూ అడిగింది.

"ఇవ్వాళ నా పుట్టిన రోజు. అందుకని..." బిచ్చగాడు తెలియ చెప్పాడు.

సి. గిరిధర రావు (తుని)

---

"నేనే—ఏంకావాలి?" అన్నాడు ఆయన అలాగే.

ఉలిక్కిపడ్డాను.. ఈ ముసలిమనిషి, కనబడీ కన్పడనికళ్ళు, వినబడనిచెవులు— వంగిపోయిన శరీరం.. వణికేచేతులు.. శాస్త్రిగారా?

నమ్మలేకపోయాను.. అప్రయత్నంగా నమస్కరించాను—మనసారా.. "కృష్ణార్పణమస్తు" అన్నారాయన.

"నేను — మూర్తి దగ్గర్నుంచి.." అన్నాను పెద్దగా.. తలూపాడు..

"నేను — అనుకుంటూనేవున్నాను.. పొద్దున సంధ్య వార్చుతూంటేను— కాకి ఒకటే అరుపు.. అప్పుడే అనుకున్నాను.." లోపలికిరమ్మని దారి చూపాడు.

నెమ్మదిగా మాటమాటకు ఆగుతూ దీర్ఘం తీస్తూ, ముక్కుతో మాట్లాడుతూన్న ఆ వృద్ధుడే ఒకప్పుడు స్ఫుటంగా మేఘ గంభీరనాదంతో నెల్లూరు టౌనుహాలులో వేలకొలది రసజ్ఞులను ఉర్రూత లూగించిన "పండిత పితామహ" శ్రీ కృష్ణ శాస్త్రి అని ఎలా ఊహించగలను?

మేరువు నీరై పారగలిగినా, అది సాధ్యం కావచ్చేమో. కాని ఎదుట ఆయనే నిలబడి "నేనే" అని అంటే!—నమ్మాల్సి వచ్చింది...గత్యంతరంలేక.

"కూర్చో నాయనా" అన్నారు శాస్త్రిగారు చాపపరిచి.

వృద్ధాప్యంతో శరీరం సడలి, దేహదార్ఢ్యం సమసి, శారీర శుభ్రత తక్కువైనందున ఒక విధమైన దుర్వాసన వచ్చింది ఆయన దేహం నుంచి.

"మూర్తి ఎలా ఉన్నాడు? టింకీ, అదీ ...."

"బాగా ఉన్నాడండి .... ఇద్దరం ఒకచోటే ఉంటాం ...."

"మంచిది .... ఏదో .... ఎక్కడో—ఒకచోట .." అన్నారాయన.

"మీ ఆరోగ్యం అదీ ...."

వేదాంతిలాగా చిరునవ్వు నవ్వారాయన. గడచిపోయిన వసంతం రానున్న హేమంతాన్ని చూచి వణికినట్లు, శిశిరర్తువు తలచి వెలవెల బారినట్లుందా నవ్వు. తనకు తానే కనుక్కున్న ప్రకృతి సహజమైన శరీరవ్యథ అర్థంచేసుకున్న నవ్వు అది.

"ఏదో .... ఇలాగే .... అయినా, నా కింకా ఏం కావాలి? పిల్లా పాపా ఎవరున్నారు? కీర్తికీ, ప్రతిష్టకీ పాకులాడవల్సిన కాలం గడిచిపోయింది ..."

"మీరీమధ్య మరేమీ రాయలేదా మాష్టారూ?" అన్నాను.

తల అడ్డంగా ఊపాడు శాస్త్రిగారు—సాలోచనగా ....

కిటికీలోంచి అవిసెచెట్టు, తెల్లని విచిత్రమయిన పూలు కన్పించాయి. మరోవేపున మామిడి చెట్టు, వాడిపోయిన తీగె .... కళ్ళు బాధగా దించుకున్నాను.

"లేదు నాయనా ... ఆ రోజులు...పోయాయి ... పది నిముషాలు కూర్చునే ఓపికలేదు .... నాలుగు పంక్తులు రాయగానే వేళ్ళు ఆగిపోతాయి .... ఇక అంతే ...."

ఫిజిక్సులో హిస్టిరిసిస్, ఫెటీగ్ చదివాను. మానవుల శరీర భాగాలూ అంతేనా?

సాభిప్రాయంగా చూచారాయన నావేపు. నేను ఆ వేళ్ళను చూచాను. పొడుగ్గా ఉన్నాయి. ముడుతలుపడి కొంత వికారంగా, గోళ్ళు పచ్చగా తయారయాయి. ఒకప్పుడు ఈ వ్రేళ్లే బంగరు ఉంగరాలతో మెరుస్తూ ఉండేవి .... ఆంధ్రసాహితిని అదిలించేవి—

"అప్పుడేదో రాసారని విన్నాను ...."

తల ఊపారాయన .... గతంలోంచి కొద్ది కొద్దిగా సంఘటనలు వ్యక్తులూ తల్చుకుంటున్నట్లనిపించింది.

"నిజమే....అయినా దాన్ని ప్రచురించాల కదా?"

"మీ రచనలన్నీ ప్రచురించిన కంపెనీ ఉంది గదా?" నవ్వాడు .... విషాదంగా, పేలవంగా.

"వాళ్ళు నా రచనలెందుకు ప్రచురించారు? అప్పుడు నేను ఆంధ్ర కవుల్లో పెద్దవాడ్ని. నా ప్రతిమాటా, ముక్కా విలువచూపిన రోజులవి. నా నోటివాక్కు రాజాజ్ఞగా సాగిన రోజులవి. నాపేరు పెట్టుకుని బ్రతికిపోయారు వాళ్ళు .... అప్పుడు నాకు హోదా ఉంది .... సారస్వత పరిషత్తులో నేను ప్రథముడ్ని .... కాని ఈరోజు ...."

అర్థాంతరంగా ఆగిపోయా రాయన ....

"ఈరోజు మాత్రం మీరు ...."

అడ్డంగా తలూపారాయన ....

"వాళ్ళ నన్ను మరిచిపోయారు నాయనా .... అవసరార్థమే ఎవరన్నా .... అవసరం దాటితే ... అంతా ఇంతే .... "

"మీరు ఎవర్నయినా చూశారా ?"

"చూశాను .... చాలామందిని .... ఒకరోజు ఎవరో అనామకులు వ్రాసిన పిచ్చి కూతలకి నా 'పీఠిక' ముందు పెట్టుకుని కడుపులు నింపుకున్న వాళ్ళు ఇవాళ నా రచనల్లోనే తప్పులు పట్టసాగారు"

"మీ రచనల్లో తప్పులా ? అంత తాహతు ఎవరికుంది మాష్టారూ ?" అన్నాను ఆశ్చర్యంగా.

"తాహతు ! హు! అందరూ నీలాంటివాళ్ళు కారు బాబూ—పాత రచనలమీద ప్రజానీకానికి రోత పుడుతూందట .... నవ్యజనతకు నవకవిత వినిపించాలిట .... గ్రాంథికం, ప్రబంధం అడుగున తొక్కి, క్రొత్త పంథాలు తొక్కాలిట !"

ఇద్దరం మాట్లాడలేదు.....

గాఢంగా ఓ నిట్టూర్పు విడిచా రాయన .... ఆ వేడి నిశ్వాసంలో తను సహించలేనిది, బాధామయమయినదాన్ని అంతా, తన దేహాన్ని దహించేస్తున్న దాన్నంతా కసితీరా బయటు క్రక్కిన ట్లనిపించింది.

"మీకు ప్రభుత్వం నుంచి పెన్షన్‌లాంటి దేదయినా .... "

"పెన్షనా ? వాళ్ళకు నన్ను జ్ఞాపకం ఉంచుకోవాల్సిన అగత్యం ఏమిటి ? నెలకో సభా సంవత్సరీకం లాంటి వార్షికోత్సవం చేస్తే చాలదూ ?" అన్నారు శాస్త్రిగారు లేచి నిల్చుని, కష్టంమీద.

రాత్రి అక్కడే ఉండాల్సి వచ్చింది.... భోజనం దగ్గర ఆయన అవస్థ చూడలేకపోయాను. రాత్రి కావడంవల్ల కళ్ళు సరిగ్గా కన్పడవు .... అలాగే, ఎట్లాగో, తడువుకుంటూ తినసాగా రాయన ....

రవి గాంచని సత్యాల్ని రమణీయంగా రాయగల్గిన ఆ మనిషి, సామాన్యుల కందని ఊహలు చూపిన ఆ కండ్లు, అంతలో ఎలా మారాయి ?

కాలగమనం కటికవాడి లాటిది—అనిపించింది ...

ప్రొద్దున్నే నిద్ర లేచేసరికి ఆయన కన్పడలేదు .... పెరట్లో పట్టుధోవతి కట్టుకుని సంధ్య వారుస్తూ కన్పించారు శాస్త్రిగారు.

గూడులాగా ఉన్న ఆయన వక్షంమీద విభూతి రేఖలు ప్రస్ఫుటంగా మెరిశాయి. మెడలో రుద్రాక్షమాల, ఎదురుగా పంచపాత్ర, ఉద్ధరిణా, ధ్యానమగ్నుడైన శాస్త్రిగార్ని చూచి మనసులో నమస్కారం చేశాను .... త్వరగా దంతధావనము ముగించి తుడుచుకుంటూ నిలబడ్డాను బావిప్రక్క .... శాస్త్రిగారు సంధ్య ముగించి లేచారు.

ఒక్క క్షణం అటువేపు చూడకుండా ఉండి ఉంటే అపాయం జరిగిపోయేదే—అదృష్టవశాత్తు చూశాను. .... నిలుచున్న శాస్త్రిగారు క్షణంసేపలాగే నిలబడి, తర్వాత అటూ యిటూ తూలసాగారు. అసంకల్పితంగా ఒక్క ఉదుటున ఆయన వద్దకు చేరేసరికి పడిపోతూ ఉన్నారు. గభాలున జాగ్రత్తగా పట్టుకున్నాను. నా రెండు చేతుల్తో వారిని అదుముకుని తులసికోట మీద కూర్చొన

# పండుటాకు

బెట్టాను. చేతిలో నీళ్ళు తీసుకుని ఆయన ముఖం మీద చల్లి తుడిచాను .... పేరునే పిలిచాను.

కాస్సేపటికి నెమ్మదిగా కండ్లు తెరిచారు శాస్త్రిగారు .... కండ్లలో కాంతి నశించిపోయి, పాలిపోయాయి. కండ్ల క్రింద నీడలు నిలిచాయి.

"శాస్త్రిగారూ, ఎలాఉంది ?" అన్నాను.

సమాధానంగా కళ్ళు మూసుకున్నారు. క్షణంసేపు—రెండు క్షణాలసేపు అలాగే ఉన్నారు.

వెంటనే, వణికినట్లు కదిలిపోసాగారు. కనుకొలకుల నుంచి ద్రవీభూత హిమకణంలాగు రెండు కన్నీటిబొట్లు రాలాయి నా చేతిమీదికి. నిస్సహాయతా, బలహీనతా, బాధా మిళితమై, [illegible], ఆశా, మనసూ కరిగిపోగా శాస్త్రిగారు కదిలిపోతూ ఏడువసాగారు .... కంటనీరు ధారగా కారి [illegible] గీతల్లోంచి జారి నా చేతిమీద పడసాగింది .... నా



**"ఐతే ప్రేయసీ! నీ హృదయాన్ని యాచిస్తూ అందుకై దేవురిస్తూ యిక్కడో భ్రమరం తిరుగుతున్నాడని మీ నాన్నగారితో చెప్పావా ?" ప్రేయుడు [illegible] అడిగాడు. "ఆ! చెప్పాను" చెప్పిందా చిన్నది, "కాని ముష్టివాణ్ణి తన అల్లునిగా చేసుకోనని, యాచన నేరమని చెప్తున్నారు."**

[illegible] (ఒంగోలు)



మనసు వికలమయింది. మరింత దగ్గరగా తీసుకున్నాను. లాలించాను. ఎండిపోయిన ఆయన దేహాన్ని జాగ్రత్తగా లోనికి తీసుకెళ్ళి పరుపుమీద ఉంచాను .... తలక్రింద మెత్తగా తలగడా అదీ ఉంచాను.

"శాస్త్రిగారూ" అని పిలిచాను, ప్రక్కనే కూర్చుని .... కళ్ళు తెరిచారు ఆయన .... కొంచెం తేరుకొన్నారు.

"ఎలాఉంది ? ఇంకా ఒళ్ళు తిరుగుతుందా ?" అన్నాను.

"ఫరవాలేదు .... ప్రతిరోజు ప్రొద్దునా ఇంతే."

ఎక్కడో గతంలోంచి, పాతాళంలోంచి వాక్కు వినవచ్చింది — ఎక్కడి మేఘ గంభీర నినదం — ఎక్కడి గద్గదమైన అస్ఫుటస్వరం !

"మందేం తీసుకోటంలేదా ?" అన్నాను.

"ఎలా నాయనా ? వాటికి తాళుకోలేను—ఉష్ణం చేస్తాయి .... కాకపోయినా చాలా ఖరీదు."

ఒక్కసారిగా మూర్తిమీద విపరీతమయిన కోపం వచ్చింది.

ఆయన్నలాగే విశ్రాంతి తీసుకోనిచ్చాను..... ఆయన అలాగే, అదే పట్టుపంచతో, రుద్రాక్షలతో, విభూతితో నిద్రపోసాగారు .... గతమూ, వర్తమానమూ, భావి లేని కాలంలోకి—బాధా, సుఖమూ నిరాశా ఆశా లేని నిద్రలోకి దిగజారిపోయారు.

మధ్యాహ్నం భోజనాలవేళకి ఆయన పూర్తిగా కోలుకున్నారు. ఇంట్లో గోడలకి తగిలించిన ఫోటోలన్నీ చూపించారు ఒక్కొక్కటీ—

"ఇది నా 'ఆంధ్ర సంస్కృతి' ప్రచురించిన రోజు నాకు సన్మానం చేసినప్పటి ఫోటో—కాశ్మీర శాలువా, వెయ్యిన్నూట పదహార్లు ఇచ్చారారోజు .... రెండూ పోయాయి—రెండూ లేవు—"

ఫోటో చూశాను. ఆజానుబాహువు, స్ఫురద్రూపి, తేజస్వి అయిన శ్రీ కృష్ణశాస్త్రిగారికి ఎవరో శాలువ కప్పుతున్నారు వినయంగా, గౌరవప్రదంగా—

"ఆయన పేరు రామమూర్తిగారా ?" అన్నాను చూసి.

"అనుకుంటాను— అవునవును— ఆయనే—" అన్నారాయన.

"ఆయన ఇప్పుడు సెంట్రల్ గవర్నమెంటులో పెద్ద ఆఫీసరు. ఆలిండియా రేడియోలో ఏదో డివిజన్" అన్నాను.

"ఆ రోజుల్లో ఆయన మాట్లాడితే గలభా చేసేవారు .... ఆయన రచనల్ని నేను రెకమెండు చేసేంతర్వాత ఎక్కడయినా ప్రచురించేవారు ?" అన్నారు శాస్త్రిగారు చిరునవ్వుతో.

ఎన్నో సన్మానపత్రాలు—కాలేజీల్లో, హైస్కూళ్లలో సాహితీ, సంస్కృతీ, నాటక సంస్థల్లో — పుస్తకావిష్కరణ సమయాల్లో—ఎన్నో—ఎన్నో—

అమావాస్య గాఢాంధకారంలోంచి నిండు పున్నమిలోకి పోయినట్లనిపించింది. అవన్నీ జాగ్రత్తగా తుడిచి, అతి ఆప్యాయంగా అన్నీ ఎక్కడి వక్కడ ఉంచారు ఆయన .... ఆ సమయంలో శాస్త్రిగారి ముఖంమీద నిలిచిన విచిత్రమైన కాంతి, ఆనందం, శోభ నన్ను ఎంతో సంతోషపెట్టాయి.

వచ్చేది నిశీధి అని తెలిపినా క్షణికమైన సంధ్య ఎంత మనోరంజకంగా ఉంటుందో పగటి తర్వాత !

సాయంత్రం నాలుగు గంటలకి ఊరికి బయలుదేరాను. రోడ్డుదాకా వచ్చారాయన వద్దన్నా వినకుండా. తడబడుతూ చేతికర్రతో నడుస్తూ, అడుగడుక్కీ ఆయాసపడుతూ అలాగే వచ్చారు. రోడ్డు ప్రక్కన కంకరరాళ్ళుపోసి ఉంచారు. ప్రక్కనే విశాలమయిన మర్రిచెట్టు .... దానికింద నిలిచాం యిద్దరం.

మూర్తి యిచ్చిరమ్మన్న రెండు వందలూ తీసి ఆయన కిచ్చాను. అడ్డంగా తలూపాడు.

"వాడికి చాలా అవసరం అవుతాయి ... నా కెందుకు" అన్నారు. బలవంతంచేసి, జేబులో ఉంచాను. దూరంగా దుమ్ము లేచింది .... మరో అరమైల్లో నన్ను మళ్ళీ వెనక్కు తీసుకుపోయే మోటారు వస్తూంది .... ఆపిడ్డా, ఆల్కహోలూ రమ్మన్నాయి.

"మూర్తి నోమారు రమ్మని చెప్పుతావుకదూ ?" అన్నారు శాస్త్రిగారు. కంఠం బొంగురుపోయింది.

"సెలవు దొరికితేగాని చెప్పలేను" అన్నాను.

"కష్టమా ?" అని అడిగాడు.

"కొంచెం — రిసర్చి చేసినా చేయకపోయినా ఇరవయినాల్గు గంటలూ ఉండాల్సిందేనండి అక్కడ" అన్నాను.

"వీలుచూసుకుని, ఓసారి రమ్మని చెప్పు బాబూ" ఆశగా, నిరాశగా, ఆవేదనగా విన్పించాయి మాటలు.

మూర్తికి సెలవు దొరుకుతుందో, లేదో ? దొరికినా, మూర్తి వస్తాడా ?

అంతదాకా శాస్త్రిగారు కాచుకుని ఉండగలరా?

ఏం చూచుకుని ? అరిగిపోయిన శరీరం, అలిసిపోయిన మనస్సు, రగిలి చల్లారిపోతున్న మేధస్సూ ఆయనకాపాటి ఆధారం ఇస్తాయని ఆశించడం— సత్యదూరం. కరిగిపోయిన ఉజ్జ్వల గతమూ, చీకటి పడినట్లు క్రమ్ముకుని వస్తూన్న భవిష్యత్తూ ఆశను చుట్టుముట్టి, ఆప్యాయతనూ, వాత్సల్యాన్నీ ఓడించగలవు—

శాస్త్రిగారివంక చూచాను. తల వంచుకునే అడిగారు.

"సెలవు దొరికితే వస్తాడా మూర్తి ? చాలా విషయాలు ...." పెండ్లి కాబోలు అనుకున్నాను. నవ్వు వచ్చింది .... మనుమణ్ణి చూడాలని సహజమైన కోరిక పుట్టిఉంటుంది ! జీవనసంధ్య తుది వెలుగులు చీకటిరంగులు పులుముకుంటూన్న వయస్సులో ఎంత తీయని కోరిక ! తన్నెదిరించిపోయిన కొడుకు తిరిగి వస్తాడని ఎంత ఆశ !

బస్సు వచ్చింది....ఎక్కి కూర్చున్నాను. ఆయన నావేపు చూచారు. రంగుమారిన కండ్లల్లో నక్షత్రాలు మెరిశాయి.

"మీ ఆరోగ్యం జాగ్రత్త మాష్టారూ !" అనగలిగాను.

"నాకేం బాధలేదు నాయనా, మరేం ఫర్వాలేదు !" అన్నారు ధీమాగా, నవ్వ ప్రయత్నిస్తూ, ఆశగా. అలాగే కావాలని ఆశించాను. చీకటి కూడా చల్లగానే రావాలి కదా జీవితంలోకి !

పైనుంచి ఏదో ఆయన చేతిమీద పడి, క్షణంసేపు నిలిచిం దక్కడే—దాన్ని తటాలున విదిలించుకున్నారు శాస్త్రిగారు. వణికిపోయా రాయన క్షణంలో—

నా గుండె కొట్టుకుంది — అది పచ్చబారి గాలికి రాలిన పండుటాకు. 

---

# సత్యనారాయణ

29-వ పేజీ తరువాయి

ఒళ్లంతా గజగజ లాడసాగింది. "ఏమబ్బాయ్?" అన్నారాయన మళ్లీ. పెల్లుబికిన సంతోషంతో అతడు 'ఊఁ' అన్నాడు. డి. యల్. గారు సత్యనారాయణకు మేకప్ చేయించి, బొమ్మలు తీసి — తన 'సిపాయికూతురు'లో హీరోవేషం ఇచ్చారు !



'పార్వతీప్రభావం'లో ! మణితో

ఇన్నాళ్లు ఇన్ని అవస్థలుపడినందుకు ఫలితంగా ప్రప్రథమంగా 'హీరో'పాత్ర రావటంతో అతను మురిసిపోయాడు. నెలజీతంమీద మూడుసంవత్సరాలకు సత్యనారాయణను డి. యల్. గారు 'బుక్'చేసుకున్నారు. ఆసమయంలో అతను ఇతరచిత్రాలలో నటించేందుకు లేదు!

'సిపాయికూతురు' చిత్రం విడుదలైనతర్వాత, సత్యనారాయణకు నాలుగునెలలుదాకా మళ్లీ ఎక్కడా పాత్ర లభించలేదు. తాను చిత్రాలకు పనికి రానేమోననికూడా అనుకున్నాడు. 'సిపాయికూతురు' చిత్రంలోని తనపాత్ర ప్రజాదరణ పొందలేదు! దాంతో మళ్లీ అతను నిరుత్సాహపడ్డాడు.....

తర్వాత, విఠలాచార్యగారు సత్యనారాయణను మాడర్న్ థియేటర్స్‌వారికి పరిచయంచెయ్యగా 'సహస్రశిరచ్ఛేద అపూర్వచింతామణి' చిత్రంలో ఒక రాకుమారుడిపాత్ర ఇచ్చారు. తర్వాత అతను 'కనకదుర్గ పూజామహిమ'లోనూ, 'వరలక్ష్మీవ్రతం'లోనూ దుష్టపాత్రలను నిర్వహించాడు. ఇటీవలవచ్చిన 'స్వర్ణగౌరి'లో శివునిపాత్రకాక, రెండు చిత్రాల్లో 'గెస్టు' వేషాలు వేశాడు. అవి: భీష్మలో" శివుడు, 'మోహినీరుక్మాంగద'లో విష్ణువూనూ. ప్రస్తుతంసత్యనారాయణ,'శ్రీకృష్ణార్జునయుద్ధంలో' కర్ణుడిగానూ, 'విష్ణుమాయలో' బలరాముడిగానూ, 'నువ్వానేనా'లో రౌడీగాను, 'లవకుశ'లో భరతుడిగాను, 'మదనకామరాజు'లో వృద్ధపాత్ర నరేంద్రవర్మగానూ నటిస్తున్నాడు. 'పార్వతీప్రభావం'లోనూ, వోల్గావారి చిత్రంలోనూ దుష్టభూమికలను నిర్వహిస్తున్నాడు. ఇదికాక 'శివగంగమహిమ' 'శివరాత్రిమహిమ' అనే కన్నడచిత్రాలలోకూడా నటిస్తున్నాడు.

అట్లాగే మంచంమీద పడుకున్నాడు. తెల్లవారేసరికి మామూలుగా లేచికూచున్నాడు. "నేను బ్రతికేవున్నాను— నాకు సినిమా ఛాన్సు వుంది—సినిమా ఛాన్సు వుంది" అనుకున్నాడు గట్టిగా—'ఏమైనా సరే, నాప్రయత్నం నేను మానను" అని నిర్ధారించుకున్నాడు. ఆనాడు, బ్రతికివున్న సాలెపురుగు రాబర్ట్ బ్రూసుకు ధైర్యాన్నిస్తే, ఈనాడు చచ్చిన సాలెపురుగు ఈవిధంగా సత్యనారాయణకు ధైర్యాన్ని కలిగించింది!

సత్యనారాయణకు అప్పుడు ఆదాయమల్లా, రేడియోవాళ్లిచ్చే నాటకాలు. నెలకు ఒకటి రెండుసార్లు అతను రేడియోనాటకాల్లో పాల్గొనేవాడు. వాళ్లిచ్చిన డబ్బూ, ఇంటినుంచి తెప్పించుకుంటున్న డబ్బుతో అతను ఒకపూట తిని, రెండోపూట పస్తు పడుకునేవాడు. ఒకసారి రేడియోకు పావుగంట నాటికకూడా రాసియిచ్చాడు! దానిపేరు 'అంతుతెలియని అంతస్తులు.' ఈనాటకం రేడియోలో ప్రసారమైంది.

ఇట్లా వుండగా— బి. ఏ. సుబ్బారావుగారు, సత్యనారాయణను కె. వి. రెడ్డిగారికి పరిచయం చేశారు. అప్పుడు కె. వి. 'పెళ్లినాటిప్రమాణాలు' తీస్తున్నారు. ఆచిత్రంలో ఒకపాత్రకు అతన్ని 'టెస్టు'కూడా చేశారు. ఐతే, ఆటెస్టు సంతృప్తికరమైన ఫలితం ఇవ్వనందువల్లనో, లేక ఆ పాత్రకు ఇతను సరిపోడనో— కె. వి. రెడ్డిగారు, "నువ్వేం దిగులుపడకు, నీకు సరిపోయేవేషం వచ్చినప్పుడు, నేను తప్పకుండా యిస్తాను. నాచేతనైనంత సహాయం చేస్తాను.నువ్వు మీవూరువెళ్లి ఏంచేస్తావు? అక్కడేదో వుద్యోగానికి ప్రయత్నించాలి. ఆప్రయత్నమేదో ఇక్కడే చెయ్యి" అని ప్రోత్సహించి, అతన్ని గురించి ఇతరనిర్మాతలకూ దర్శకులకు చెబుతూవుండేవారు. ఆ సందర్భంలోనే కె. వి. గారు, సత్యనారాయణను డి. ఎల్. దగ్గరకు పంపించారు.

సత్యనారాయణను మొదటిసారి చూడగానే డి. యల్ "నాచిత్రంలో హీరో వేషం వుంది—వేస్తావూ?" అని అడిగారు. ఇది కలో, డి. యల్. గారు హాస్యం ఆడుతున్నారో అతనికి అర్థంకాలేదు.

కైకల సత్యనారాయణకు 60లో వివాహమైంది. రోజూ అతను వ్యాయామంచేస్తాడు, తీరుబడివుంటే పుస్తకాలు చదువుకుంటాడు. క్రికెట్ ఆటలో వీలున్న ప్రతిసాయంత్రమూ పాల్గొంటాడు. తనకు ప్రధమంగా అవకాశంకలిగించిన డి. యల్. గారు తనను తండ్రిలా చూచుకునేవారని, వారికి తన కృతజ్ఞతలు తెలుపుతూ— "నాకు నాటకాలంటే చాలాయిష్టం. నాటకాల్లోపాత్రలు ధరిస్తూనేవున్నాను. నేను మొదట హీరోగా ప్రవేశించినా, ప్రస్తుతం 'విలన్'పాత్రలనే ఎక్కువగా ధరిస్తున్నాను. పరిశ్రమ నన్ను విలన్‌గా గుర్తించింది. ఆ పాత్రలలో రాణించాలని, రాణించగలిగేందుకు అవకాశాలు కలుగుతాయనే ఆశిస్తున్నాను."అన్నాడు 'విలన్' సత్యనారాయణ, 'హీరో'లా మృదువుగా నవ్వుతూ. —సుకుమార్ ] ★

# ఉత్తరా(మా)యణం

24-వ పేజీ తరువాయి

సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ గడపాలని ఉంటుంది. కాని తీరా వెళితే పట్టుమని పదిరోజులుకూడా ఉండలే ననుకుంటాను. నీ కెలా ఉబుసుపోతోంది ?

ఉబుసుపోక అంటే జ్ఞాపకంవచ్చింది. పొల కొల్లు తరచు వెళ్తున్నావనుకొంటాను. నిన్ననే ఎస్సల్సీ పరీక్షాఫలితాలు వచ్చాయి. మీపిన్నిగా రబ్బాయి పాసయ్యాడా? పనిపాటలు లేక పరీక్షల నెపంతో అప్పట్లో రాత్రి తొమ్మిదీ పదింటికీ కాఫీలు త్రాగటానికి వెళ్లినరోజులు జ్ఞాపక మున్నాయా? అప్పుడు చదువుసంధ్య లెలా ఉన్నా ఉబుసుపోయేది మొత్తానికి. ఈ ఉబుసుపోక అన్న పదం తెగవాడుతున్నానుగదూ! నిజానికి ఈ పదా నికి (సరిఅయిన) అర్థం నాకు తెలియదు. అంతకీ అడిగితే క్యారమ్సు ఆడటం; నవలలు, పత్రికలూ చదవటం, స్టాంపులు సేకరించటం, సినిమాలు చూడటం — ఇవే ఉబుసుపోకకు అర్థమని చెబు తాను. నువ్వూ, నేనేకాదు ఈ కాలపు విద్యార్థు లంతా దాదాపు ఇదే అర్థం చెబుతారు.

మా నాన్నగారి సంగతి నీకు తెలుసు. ఇంగ్లీష్ లిటరేచరు చదవమంటారు. అదంటే నాకు టెంప రేచర్ తగులుతుంది. అయినా ఈమధ్య చదవటం అలవాటుచేసుకుంటున్నాను. మరి నీమాట? సిని మాలు బాగా చూస్తున్నావా? "మూడుగంటల కాలక్షేపానికి డబ్బు తగలెయ్యటం!" సినిమా (బయస్కోపు) కర్థం ఇదే గావచ్చు. అయినా ఈ నెలరోజులలోను నేను ఎట్‌లీస్ట్ పన్నెండు పిక్చర్స్ చూసాను. ఆ లిస్టు ఇక్కడ ఇవ్వలేను. ఇంకొక విషయం? ఉబుసుపోకకు ఈమధ్య వ్రాసిన కథ ఒకటి పత్రికకు పంపాను. ఎప్పుడు తిరిగి వస్తుందో ఏమో! త్వరగా వచ్చేస్తే బావుణ్ను! ఇం కొక పత్రికకు పంపచ్చు. రావటం మాత్రం తథ్యం! నేనింత పెద్ద ఉత్తరం ఇంత హస్కుతో వ్రాశా నంటే నువ్వు ఎలా ఫీలయేది చెప్పలేను. బహుశః నవ్వుకొంటావు. ఆపైన పైత్యంక్రింద జమ కడతావు. కాని కారణంవుంది. నీకు కొద్దిసేపు కాలక్షేపం కావటమే నా ధ్యేయం!

నేను ఉత్తరం ఆరంభించిన విధమేవేరు. "నేను క్షేమం. నీవు క్షేమంగా ఉన్నావని తలుస్తాను. ఇంతే సంగతులు" అని వ్రాయటం నాకు గిట్టదు. ఆ విషయం ప్రత్యక్షంగా తెలుస్తోనే ఉంది. మనం ఉత్తరం వ్రాస్తున్నామంటే దానిలో మనవ్యక్తి త్వం (పెర్సనాలిటీ) ప్రతిబింబించాలన్నది నా తత్త్వం! ఇదంతా నీకు నచ్చకపోవచ్చు; విసుగూ అనిపించవచ్చు. పిచ్చిపిచ్చిగా వ్రాశాననిపిస్తే వెంటనే చింపేసి 'నీవుత్తరం అందింది' అంటూ జవాబియ్యి చాలు! నీవు ఇన్నాళ్లుగా ఉత్తరం వ్రాయ నందుకు మా అమ్మగారు దూరంగా ఉన్నన్నాళ్లు మనం ఒకరికొకరం జ్ఞాపకం ఉండమని అనుకొంటు న్నారు. కాని నాకుమన స్నేహంమీద నమ్మకంఉంది.

ఉత్తరాలు వ్రాయటం ఒక హాబీ! అది అంద రికీ చేతగాదు. నాకు దీనిని హాబీచేసుకోవాలనే ఉంది. కాని కేవలం స్టాంపుల సేకరణ విషయంలో తప్పితే నే నింతపెద్ద ఉత్తరం ఎప్పుడూ ఎవరికీ వ్రాయ లేదు, ఇప్పుడు తప్ప! మన పి. యు. సి. రిజల్ట్సు ఎప్పుడు వస్తాయో ఏమో!

నీ ఆరోగ్యం బాగుందని తలుస్తాను. క్రితం సారి గొందివెళ్లి వచ్చేటప్పటికి బాగా వళ్లబడ్డావు. మరి ఈసారి....? నీవు వచ్చినపుడు చూస్తాగా.... రాజమండ్రి త్వరలోనే వస్తావని ఆశిస్తున్నాను. ఇంతకంటే ఏం వ్రాయాలో, ఎలా వ్రాయాలో బోధపడదు. ఇక నిన్ను విసిగించటంకూడా ఇష్టం లేదు. పూజ్యులైన నాన్నగారికి, అమ్మగారికి నా నమస్కారములు.

ఇట్లు
రాంబాబు.

* * *

గొంది,
12—6—1961

డియర్ రామకృష్ణారావు,

నీవు దయతో వ్రాసిన పెద్ద ఉత్తరం నిన్ననే అందింది. ధన్యోస్మి! నీ ఉత్తరం చదువటానికి పావుగంట పట్టింది. నిజానికి ఇంకొక ఉత్తర మైతే విసుగుపుట్టేది. కాని నీఉత్తరం మా యిం టిలోవారి నందరినీ తప్పుదారి పట్టించింది. ఇదేదో అప్లికేషన్ ఫారమ్ కాబోలునని పొరబడ్డారు. తీరా చూస్తే.... నీ ఉత్తరం!

నేను ఉత్తరంముక్క వ్రాయలేదంటే కారణం లేకపోలేదు. చీమ తుమ్మటం ఎంత అసం భవమో, అకారణంగా నేను ఉత్తరం వ్రాయక పోవటం అంత సంభవం! నిజానికి నేను గొంది వచ్చినప్పటినుంచి ఒక క్షణంగూడా తీరిక ఉండటం లేదు: ఉదయం ఆరింటికే పొలం వెళ్లటం, పది గంటలకి తిరిగివచ్చి భోజనంచేసి మళ్లీ వెళ్లటం ఇది ఇక్కడి నా నిత్యకృత్యం. అదీగాక మాఅన్నయ్య పనిమీద హైద్రాబాద్ పోవటంమూలానా మరింతపని పైబడింది. ఇంకేమిచెప్పను ? నీఉత్త రం నన్ను తీరిక కల్పించుకొనేలా చేసింది. అందుకు థాంక్స్! స్నేహమనేది దగ్గరఉంటేనేగాదు దూరాన ఉన్నప్పుడుకూడా ఉంటుంది. నేను ఉత్తరం వ్రాయనందుకు కారణం చెప్పానుగదా! నేను ఇక్క డకు వచ్చాక ఒక్క సినిమాకూడా చూడలేదు. మా పిన్నిగారబ్బాయి పాసయినట్లు చెప్పమన్నాడు. జ్ఞాపకం ఉన్నందుకు వెరీ మెనీ థాంక్స్ అన్నాడు. నేను నాలుగైదురోజులలో రాజమండ్రి వస్తాను. నిన్ను మరచిపోలేదని ఈ ఉత్తరమే చెప్పకచెబుతుంది.

ఇట్లు
నీ ప్రియమిత్రుడు,
భాస్కరం.

* * *

రాజమండ్రి,
20—6—61.

డియర్ భాస్కరం,

ఉభయకుశలోపరి. జవాబు ఆలస్యంగా వేస్తు న్నందులకు క్షమించాలి. నీ ఉత్తరం చేతికందాక గుండె దడదడలాడింది. "నా ఉత్తరం విలువ నెలా అంచనావేశావో?" అని సందేహిస్తూ కవరు విప్పాను. చదివాక భయంతీరింది. నేనాశించిన సమాధానమే! నా ఉత్తరం చింపిపారేయనందుకు ధైర్యం చిక్కింది.

ఇంతకుముందే పెద్దఉత్తరం వ్రాయటం,

# ఉత్తరా(హా)యణం

పెద్దవాళ్ళు చూడటం జరిగిందంటున్నావుగనుక, ఈసారి పెద్దఉత్తరం వ్రాయబుద్ధికావటంలేదు. ఎందుకంటే అలావ్రాయటం నా విలువను తగ్గించుకోవట మవుతుందేమో! ఇది మనలో మన మాట. అయితే "అసలు ఆవిలువనేది ఉంటేగదా తగ్గడానికి!" అని కొట్టిపారెయ్యొచ్చు. కాని ఇది ఉత్తరం! నీవైనా వ్రాయకవ్రాయక వ్రాశాను గనుక మొదటి ఉత్తరం పెద్దదైనా ఓపికగా చదివావు. ఏమో! ఈ సారి నీకు రుచిస్తుందని ఎలా అనుకోను? చదవకుండా ఏమూలనో పారేస్తావు! ఎన్నో కబుర్లు చెప్దామనుకొన్నాను. దీనిలోనే నిండాయి మూడు పేజీలు. ఇక నిన్ను విసిగించను. తీరికా, ఓపికా, కుతూహలం ఇత్యాదులన్నీఉండి నీకిష్టమైతే (ఇకముందు) ఓల్డ్‌ఫ్రండ్‌ని కాబోతున్న నాకు జాబు వ్రాసెదవుగాక! ఇక ఉంటాను.

నీప్రియమిత్రుడు,
రాంబాబు.

* * *

గొంది,
30—6—61,

డియర్ రామకృష్ణారావు,

నువు పొరబడటం ఇది రెండవసారి! మొదటి సారి నేను ఉత్తరం వ్రాయనందున నిన్ను మరచి పోయానని అనుకొన్నావు. ఈసారి నీ విలువేమో తగ్గుతుందనుకోవటం బాగాలేదు.

మనలోమనకి విలువ తగ్గటమేమిటి హెచ్చట మేమిటి? కేవలం ఉత్తరాలమూలాన చులకన కావటం జరుగనిది. పెద్దవాళ్ళు చదివితే చదవనీ! పెద్దమాటలు మాట్లాడేసుకొంటున్నామని ఫీల యితే, లేక నవ్వుకొంటే మనకొచ్చిన నష్టం?...... లేదు! అలాగే అభినందించినా లాభంలేదు. మన విలువ మనకు ఉండనే ఉంటుంది. ఈ విషయం నాకు బాధకలిగి వ్రాశాను. మరోలా అనుకోకు.నిజం! ఒకవిషయం చెప్పనా? మా నాన్నగారు నీ ఉత్తరం చూచారు. నీగురించి చెప్పాను. నిన్ను చూడాలను కొంటున్నారు. నేను వచ్చి రాజమండ్రిలో చదవ టమేగాని ఆయన అక్కడి కెప్పుడూ రాలేదు. అందుచేత నువ్వుకూడా మానాన్నగారిని చూచి ఉండవు. నీవు వీలుచిక్కినప్పుడు గొందికి రాకూ డదూ? నీ ఉత్తరాలు నాకు మంచి కాలక్షేపం! ఇక ఉండనామరి!

నీమిత్రుడు,
భాస్కరం.

* * *

రాజమండ్రి,
4—7—61.

డియర్ రావ్,

నీ ఆహ్వానానికి కృతజ్ఞుణ్ణి. ఒకసారి తప్ప కుండా మీ ఊరికి వస్తాను. వ్రాయవలసిన సంగతులన్నీ ఇదివరకు వ్రాశాను. మిగిలినవి మరచి పోయాను. ఇకపోతే ఎంతసేపూ ఇదేధోరణిలో ఉత్తరాలు వ్రాయటం నా కిష్టంలేదుగనుక నా వ్యాసాలు, కథలు, సందేహాలు కొన్ని పంపుతుం టాను. నీకుతోచిన అభిప్రాయాలు ఇస్తూండు. ......ఇప్పటికి ఇదిచూడు.....

## "ఏమంటారు?"—

మానవులన్నాక సందేహాలు కలుగకుండా వుండవు. కలిగాక మనం చేయవలసిందేమిటి? దీనికి జవాబు నీకు తెలియదుగనుక నోరు మూసుకుండు! అని మనసుకు సర్దిచెప్పుకోవటమా? కాదు. సరియైన జవాబు దొరికేంతవరకు అన్వేషించటం మానవుని విద్యుక్తధర్మం. నేడు ఇంతగా విజ్ఞానం పెంపొందటానికి కారణం మానవుని ఊహాశక్తి! దీని కిది పరిష్కారమార్గం, దీనికిది జవాబు అని చెప్పగలబుద్ధి నాకుమాత్రం లేదూ? ఉందని నాకు తెలుసుగనుకనే ఈ అన్వేషణ! జవాబుకు ముందు ప్రశ్న, ప్రశ్నకువెనుక జవాబు ఉండటం సహజం! నాప్రశ్నకూ అంతే!

"ప్రపంచంలో అందరినీ మించిన గొప్పవారెవరు?" ఈప్రశ్న చాలాకాలంగా నన్ను వేధించుకు తింటోంది. ఈప్రశ్నకు పూర్వాచారపరాయణుల జవాబు.... "సృష్టికర్త!" అని. కాని ఇది రాకెట్ యుగమన్నవిషయం విస్మరించరానిది. దేవతా దెయ్యం అంటే ఈకాలంలో నమ్మే దెవరు? మీరు, నేను, ఎవ్వరూ నమ్మరు.

ప్రపంచంలో గొప్పవారున్నారు. గాంధీజీ, వాషింగ్టన్, హిట్లర్—ఇలా ఎందరో గొప్పవారున్నారు. తమశక్తితో ఒక్కొక్కరకంగా ప్రపంచాన్ని గడగడలాండించినవారున్నారు. కాని వారి సిద్ధాంతాల్ని, పద్ధతుల్ని అనుసరించేవారెందరు? కేవలం కొన్ని దేశాలు! కనుక వీరిలో ఏఒక్కరూ ప్రపంచమంతటికి గొప్పవారని చెప్పలేము. ఇకపోతే ఒక్కవిషయం రూఢిగా తెలుస్తుంది. మానవుడికున్న రకరకాల శక్తులు, మనస్తత్వాలు అర్థమవుతాయి.

ఆలోచిస్తే, నేడు విజ్ఞానం అమితంగా పెంపొందటానికి తోడ్పడిన వైజ్ఞానికులకే యీ ఘనత దక్కుతుం దనిపిస్తుంది. ఈ కాలంలో ప్రాణం పోయుటం తప్ప మానవుడు చేయలేనిది లేదు. దూరదృష్టి, దూరశ్రవణం, జలస్తంభనవిద్య, ఆకాశగమనశక్తి, మొదలైనశక్తులు పూర్వం, పురాణాలలో ఉన్నట్లు చెప్పబడిన శక్తులన్నీ ఈనాటి మానవునికి ఉన్నాయి. దేశానికి సేవలు చేస్తారుదేశనాయకులు. లోకాన్ని సేవిస్తారువైజ్ఞానికులు. ఎవరీ వైజ్ఞానికులు?మనమే! మనమెవరం?

ఈ పాటికి నాప్రశ్నకు జవాబు తెలిసి ఉండాలి. సృష్టికర్త భగవంతుడుకాడు. ఒకవేళ అయినా మనకు నిశ్చయంగా తెలియదు. కాని నేటి....మానవుడు సృష్టించలేనిది లేదు. చేయలేని అద్భుతం లేదు. ప్రాణంపోయుటంగూడా నేర్చినవాడు మానవుడు సర్వజ్ఞుడు. ఇక మానవాతీతశక్తులు ఏవి? మానవుడు అన్నిటికీ సమర్థుడు. క్షణంలో ప్రపంచాన్ని భస్మీపటలం చేయగలడు. ఆపైన బ్రతికించనూగలడు (ఇక కొద్దికాలంలో). ఇక నాప్రశ్న కరగిపోయినట్లే! ప్రపంచంలో గొప్పవాడు...... మానవుడు! ఏదయినా కాదనగలరేమో! గాని ఈసత్యాన్ని మీరు కాదనలేరు. ఏమంటారు?

*   *   *

దీనిమీద నీఅభిప్రాయాలు అవసరంలేదు. ఇది పత్రికకు పంపేదకాదు. నా స్వంత ఊహ ఒకటిమాత్రమే. ఇది వ్రాయటంలోగూడా ప్రత్యేకమైనఉద్దేశం లేదు. నీ కాలక్షేపానికి కానుక అనుకో?

నీమిత్రుడు,
రాంబాబు.

ఎడిటర్జీ;

ఈ విధంగా మా మధ్య చాలా ఉత్తరాలు వాటిలో ఎన్నో క్రొత్తవిషయాలు, కథలూ, వ్యాసాలూ, స్కెచ్‌లూ దొర్లాయి. మా భాస్కరం ఈ ఊరు వచ్చేముందర వ్రాసిన ఉత్తరం దానికి నా జవాబు ఈక్రింద ఇస్తున్నాను.

*   *   *

గొంది
.....

డియర్ రామకృష్ణారావు,

నీవు మొన్నటిసారి పంపినకథ బావుంది. తిరిగి పంపిస్తున్నాను. ఎక్కడైనా సందేహాలుంటే అడగమన్నావు. కథకు సంబంధించినంతవరకు సందేహాలులేవు. మనఉత్తరాలు ఇదేరీతిగా సాగుతున్నాయి. ఆలోచిస్తుంటే బుర్ర గిరగిరా తిరుగుతోంది. మొన్న రాజమండ్రి వచ్చినప్పుడు చూచాను ఈ మూడు నాలుగేళ్ళబట్టి మనం వ్రాసుకున్న ఉత్తరాలు పదిలంగా ఉంచావు. నావిగూడా జాగ్రత్తగానే ఉంచాను. అలా ఉంచమని నువ్వే చెప్పావు. ఈతడవ రాజమండ్రి వచ్చినప్పుడు తెమ్మన్నావుగూడా! మన ఉత్తరాలకు అంతంటూ లేదు. వీటివలన ప్రయోజనం ఏమైనా ఆశిస్తున్నావా? ఉత్తరాలు వ్రాస్తూనేఉండు! సందేహం తీర్చమంటున్నానే గాని, ఏమీ అనుకోకు.

నీమిత్రుడు,
భాస్కరం.

*   *   *

డియర్ భాస్కర్రావ్!

నిన్ను మభ్యపెట్టటం ఇష్టంలేదు. అన్నీ అంచనావేసి ఉత్తరాలనువ్రాశాను. అందుకని నేను బిజినెస్‌లైక్‌గా ఉన్నానని అనుకోకు. మన ఉత్తరప్రత్యుత్తరా లన్నిటికి ఒకరూపమిచ్చాను. అదేమిటో తెలుసుకోదలిస్తే వీలుచిక్కినపుడు నీ దగ్గరనున్న ఉత్తరాలు నేవ్రాసినవి పట్టుకరా! అన్నీ నీకే తెలుస్తాయి. ఉంటాను.

ప్రియమిత్రుడు,
రాంబాబు.

*   *   *

మా భాస్కరం రాజమండ్రి వచ్చాడు. ప్రస్తుతం ఇక్కడే కాలేజిలో చదువుతున్నాడు. రాగానే అడిగాడు—నేను కల్పించిన క్రొత్తగ్రంథం ఏమిటని. "ఉత్తరామాయణం" అని జవాబిచ్చాను. "హట్! ఇదో క్రొత్త రామాయణమా" అన్నాడు విస్తుపోయి. అంతలోనే నాలుక కరచుకొని "ఇదెక్కడో విన్నట్లు గుర్తు" అన్నాడు. భీష్ముడు ఉత్తరాయణంలో మరణించినట్లు వాడి కిప్పటికీ గుర్తేనట! విచిత్ర మేమంటే వాడు నేచెప్పిన అర్థాన్ని పైవాక్యంలో ప్రతిక్షేపించి "భీష్ముడు మన ఉత్తర ప్రత్యుత్తరాలలో మరణించాడు" అని వక్కాణిస్తున్నాడు. చివరికి తేల్చిందేమంటే ఇది ఉత్తరాయణం కానేకాదట! ఇంతకీ నా ఉత్తరాలకి జవాబులు వాడు వ్రాసినవి కావట! వ్రాసినవాడు వాడి పెద్దతమ్ముడే? అదేమోగాని ఇది ఉత్తరా(మా)యణమే అని బుజాచేసి పుణ్యంకట్టుకోండి! ప్లీజ్...... మీరుగనుక దయదలిస్తే ఇది ఉత్తరాయణమే అవుతుంది. ఈ సహాయం చేస్తారుగదూ? నమస్తే.....

భవదీయుడు,
వై. రామకృష్ణారావు. ★

**తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది.**

## కింగ్ ఆఫ్ కింగ్స్

28-వ పేజీ తరువాయి

ప్రవేశించింది. ఆ గుంపు అలా ముందు వెళ్తూ ఈత ఆకుల మట్టలను ముందుకు పరుచుకుంటూ సాగుతున్నది. ఆ జరిగే తీరుచూస్తే వెనకవచ్చే ఊరేగింపుకు ముందు ఓ తెరశాలా అనిపించింది. ఈ సంరంభంలో అల్లర్లు జరగకుండా శాంతిభద్రతలు కాపాడేందుకు హాజరైన సుశిక్షిత రోమన్ సైనికుల కనుగప్పి, తమ ఉడుపులలోపల కత్తులు కటార్లు దాచుకుని బరబ్బాస్ అనుయాయులు ఆ ఊరేగింపులో ఎంతో నిశ్శబ్దంగా అతిశీఘ్రంగా జొరబడ్డారు.

తెల్లని అంగరఖాలుధరించి, తలకు అచ్ఛాదనంతో ఓ చిట్టిగాడిద నెక్కి జీసస్ జెరూసలెంలో అడుగు పెట్టాడు. ప్రజలంతా మహాదరంతో స్వాగతం చెప్పారు. మహాప్రవక్తకు మ్రొక్కారు. ఆయన్ను సందర్శించి, ఆయన ఉడుపులు ముట్టుకుని పవిత్రులు కావాలని ఆరాటపడ్డారు. కానీ, ఏం లాభం?

ఆ మహనీయుడు తన వాహనం దిగ్గి ప్రజల ఆదరాభిమానాలు అందుకుంటూ పవిత్రాలయం మెట్లెక్కనారంభించాడు. ఎక్కీ ఎక్కక ముందే,

“జూడియా వర్ధిల్లాలి!” అనే పొలికేకతో, యుద్ధోన్మాద నినాద ప్రతిధ్వానంతో బరబ్బాస్ తన కత్తి దూసి రోమన్ సైనికులపై దండెత్తాడు. ఈ పరిణామం ముందుగానే ఊహించుకున్న లూసియస్, అతని సైనికులు వెంటనే తగిన సమాధానం చెప్పనారంభించారు.

పోరు ఘోరంగా సాగింది. అర గడియ క్రితం ఎంతో ఆనందకోలాహలాలతో మిన్నంటిన పవిత్రాలయ ప్రాంగణం అర్పులు, పెడబొబ్బలు, కత్తుల ఖణాఖణరావాలతో ప్రతిధ్వనించింది. పరిశుద్ధాత్మల వలె నిర్మలంగాఉన్న ఆ ప్రదేశంను పాలిత పాలక కార్పణ్యాలు రక్తరూపంతో రోతపరిచాయి. విప్లవకారులకే విజయమనిపించినా విజయలక్ష్మి రోమన్లనే వరించింది. సుమారు వెయ్యిమందికిపైగా తన అనుచరులు రోమనుల చక్రబంధంలో బలైపోగా బరబ్బాస్ నిస్పృహతో లూసియస్‌కు లొంగిపోయాడు.

యూదుజాతికోసం తన ప్రియతమనాయకుడు బరబ్బాస్ ఓడిపోయి చెరసాలకేగడం జూడాస్‌లో ఆవేదన, ఆవేశం కలిగించాయి. జీసస్ మహాశక్తిసంపన్నుడనీ, ఆయన తల్చుకుంటే రోమనులను నాశనం చేయగలడని తననమ్మకం. ఏవిధంగానైనా జీసస్ పీకలమీదికి కత్తిపెడ్తే ఆపద్ధర్మంగా అహింసను వదిలేస్తాడని అపోహపడ్డాడు జూడాస్. జీసస్ తనకుతానే రాజని చెప్పుకుంటున్నాడని నిందమోపి నిర్బంధింపజేస్తే ఆయన తన శక్తిసామర్థ్యాలతో మహిమలతో ప్రకారపద్ధతిలో ఈ అడ్డంకుల్ని ఎదుర్కొనగలడని జూడాస్ బరబ్బాస్ అనుచరులను రహస్యంగా కలుసుకుని చెప్పాడు.

యుద్ధంనాటి రాత్రి జీసస్ తన పన్నెండుమంది శిష్యులతో, శిష్యుడు

## పాపాయిప్రాభవము

దేవరకొండ దుర్గాప్రసాదరావు

రమ్యమైన రీతులలో
రాయంచలు నడచు
మరాళగమనమును మించి
మాపాపే నడలు.

రాత్రియందె చందురుండు
రమ్యముగా వెలుగు
పగలు రేయి పాపమోము
ప్రకాశించుచుండు.

చిట్టి రెండు మాటలాడి
చిలుక చాల కులుకు
పాపపలుకు ప్రతిపలుకూ
పంచదార పలుకే.

ముత్యములకు కలదుకదా?
ముచ్చటైనరూపు
పాపనోటి ముత్యములకు
పదనుకూడ గలదు.

మబ్బుజూచి నర్తనము,
మయూరములు జేయు
పాపవద్ద నేర్చుకొనెను
ప్రతికదలిక నెమిలి.

మెఱుగుపెట్టగా పసిండి
మెఱపు మెఱయుచుండు
పాపమేను మెఱుగులేకె
పలువిధముల మెఱయు.

పాపయొక్క ప్రాభవమును
పరికించుచునుండ
అన్నిటిలో పాపాయే
మిన్నగ నగుపించు.



# కింగ్ ఆఫ్ కింగ్స్

లాజరస్ ఇంట్లో సమావేశం ఏర్పాటు చేశాడు. జూడస్ తన ప్రక్కకు రాగానే జీసస్ "చెయ్యాల్సిందేదో త్వరగా కానీ" అని నెమ్మదిగా, మృదువుగా హెచ్చరించాడు. జూడస్ వెంటనే బైటకు వెళ్ళిపోయాడు.

తనలో చెలరేగుతున్న సంఘర్షణలో ఏది సజావైనదో తెలుసుకోలేని జూడస్ తప్పుత్రోవనే తీసుకుని, చరిత్రలో ద్రోహిగా విశ్వాసఘాతుకుడుగా వర్ణింపబడటమే విధిలిఖితమేమో... ఉన్నతమతాధికారికి జీసస్‌ను పట్టించి స్వామిద్రోహ పాపం చేశాడు.

జీసస్ తనశిష్యులతో "మీరు నన్ను అత్యంతం ప్రేమిస్తున్నారని నే నెరుగుదును. ఐనా ఈ పీటరు తెల్లవారి కోడి మూడుమార్లు కూసే లాగా నన్నెరుగనని అబద్ధమాడ్తాడు" అన్నాడు.

రొట్టెను పంచి, "ఇది నా శరీరములో భాగము. నా జ్ఞాపకార్థము ఇది," మద్యమును "ఇది నారక్తము మానవులందరికొఱకైన, క్షమాపణ కొరకుగాను చిందించబడినది. దీనిని పుచ్చుకొనండి" అని ఇచ్చాడు. ఈ వాక్కుకు అర్థం వాళ్ళకప్పట్లో తెలియకపోయినా వాళ్ళ హృదయాలు మాత్రం ఏదో తెలియని ఆనందం, నరాలుకోసే బాధ అనుభవించాయి.

ఎప్పటిమాదిరిగా జీసస్ ఏను ఋగు శిష్యులు దైవప్రార్థనకోసం గెత్సెమేన్ ఉద్యానానికి వెళ్లారు. జీసస్ వారికి కొంతదూరంగా వెళ్లాడు. ఒక్క క్షణకాలంపాటు మనస్సు హింసపట్ల, హింసాత్మకంగా రోమన్‌లపై తానుసాధించగల ప్రతీకారంపట్ల పరవళ్ళు త్రొక్కింది. కాని అంతలోనే నిగ్రహించుకున్నాడు-ప్రలోభాలకు అతీతమైన శక్తి ప్రసాదించమనీ తన ఆత్మత్యాగం ద్వారా ప్రేమంటే ఏమిటో తెలియజెప్పనీమనీ ఐహిక అధికార వాంఛకు మనస్సు లోనుగాకుండా కాపాడి తన జన్మ సాఫల్యానికి అవకాశం కల్పించమనీ భగవంతుణ్ణి వేడుకున్నాడు.

ఈలోగా జూడస్ ఆలయరక్షకులను తీసుకువచ్చాడు. ముద్దు ద్వారా జీసస్‌ను గుర్తించాడు ఇది గమనించిన పీటర్ జూడస్‌పై నీకత్తి దూయగా "కత్తిపట్టిన వారి మరణం కత్తితోనే" అని జీసస్ వారించి ఆ రక్షకభటుల వెంబడి వెళ్ళిపోయాడు.

జైల్లో పీటరు కోడికూసేలోగా అప్రయత్నంగా "నేను జీసస్‌ను ఎరుగను. ఆయనతో రాలేదు. నే వారిజట్టు కాదు" అన్నాడు. దీనితో జీసస్ ప్రవక్త అని తేల్చుకున్నాడు. తానెన్నో ఆశలతో ఎంతో ఘనకార్యాన్ని జీసస్ చేస్తాడని ఈ ప్రళయం తెచ్చిన జూడస్ తన గురువు, స్వామి, అతిసామాన్యునివలె వెళ్ళడం గమనించి లోలోపల కుమిలిపోయాడు. ఆయన సిద్ధాంతాలే ప్రవక్తకు లక్షణములా అని కూడా అనిపించింది.

తన ఎదుటకు బందీగా వచ్చిన జీసస్‌ను చూసి పాంటియస్ "తమరేదో యూదుల రాజుగా ప్రకటించుకుంటున్నారని విన్నానే" అని వెక్కిరించాడు.

పిలేట్ సమక్షంలో జీసస్‌పై విచారణ ప్రారంభమైంది.

(సశేషం)

# చాకలివాడు

17వ పేజీ తిరువాయి

గలను. కానీ, సినిమాలో జరిగే (లేక జరిపే) వింతలు నిత్యజీవితంలో జరిపించటం అంత తేలికయిన పనేమీ కాదు. అందువలన నేను యింట్లో కూర్చుని స్వగతంలో ఏమి అనుకున్నా లాభంలేదు. సాక్షాత్తూ ఆ శ్రీమన్నారాయణమూర్తి యింటికి మరొక్కసారి వెళ్ళి దర్శనం చేసుకుంటేనే కానీ, మా గుడ్డలు యింటికి చేరేటట్లు లేవు.

ఇక చేసేదేముంది ! మళ్ళీ వాడి యింటికి వెళ్ళి వచ్చాను. ఈసారి లోగడకంటే గట్టిగానే మాట్లాడి వాడు ఒక దారికి వచ్చేటట్లు చేశాను. "బాబ్బాబు! మీరు కోపగించుకోకండి ! మీ గుడ్డలు యింకో అరగంటలో తీసుకువస్తాను" అన్నాడు.

అదేమి విచిత్రమో, వాడు చెప్పినట్లు గుడ్డలు ఆరోజు మా యింటికి చేరినాయి. నేను గర్వంగా మా ఆవిడవంక చూశాను. "చూశావా ! నామాటంటే యెంత హడలో ?" అన్నాను.

"ఏడిచినట్లే ఉంది ! చూడండి ! ఈ గుడ్డలు యెలా ఉతుక్కు వచ్చాడో !" అంది మా ఆవిడ.

"ఏమి ! ఏమి జరిగింది ?" అన్నాను ఆదుర్దాగా.

"మీ చొక్కా నిలువుగానూ, అడ్డంగానూ చక్కగా చింపుకు వచ్చాడు. నా చీర అంచు చక్కగా బద్దలుకొట్టుకు వచ్చాడు. ఇంకేమి కావాలి చెప్పండి ?" అంది శ్రీమతి.

"వాట్ !" అని ఒక్కసారి కళ్ళజోడులో నుంచి యెగాదిగా మా ఆవిడవంక, చాకలివాడివంకా చూసి, ఒక్కసారి 'సెట్' మీద పోర్షన్ మరచి పోయిన హీరోలాగా "ఇప్పుడేమి చేద్దామంటావ్ ?" అన్నాను ప్రశ్నార్థకంగా మా ఆవిడ వంక చూస్తూ.

"ఏమిటి చేయడం అంటారేమిటి ! వీడిని మాన్పించి యింకొక చాకలివాడిని కుదర్చండి. మీ ఆఫీసులో చాకలివాళ్ళు ఎవరూ లేరూ ?" అంది గుడ్డల నన్నింటినీ పరీక్షగా చూస్తూ.

శ్రీమతి చెప్పింది బాగానే ఉంది. కానీ, మరొక చాకలివాడుమాత్రం సరిగ్గా గుడ్డలు తీసుకు వస్తాడని నమ్మకమేమిటి ? ఒకవేళ తెచ్చినా, గుడ్డలు సరిగ్గా (అంటే, శాల్తీలు గల్లంతు కాకుండా, గుడ్డలు చింపకుండా) తీసుకువస్తాడని నమ్మక మేమిటి ? చాకలివాళ్ళు అందరూ ఈ విషయంలో ఒకటిగానే ఉంటారని నా నమ్మకం. అదే బయటికి వ్యక్తంచేశాను.

"నీకు పిచ్చికానీ, మరొక చాకలివాడిని పెట్టినా వాడు మాత్రం గుడ్డలు తీసుకురావడంలో ఆలస్యం చేయడని నమ్మకం ఏమిటి ?" అన్నాను.

"అలా గయితే, వాడికే గుడ్డలు వేసి, చక్కగా అన్నీ చింపించుకోండి" అంటూ ఒక చొక్కా బయటికితీసి చూపించింది.

ఈ చాకలివాడు గణితశాస్త్రజ్ఞుడులాగా ఉన్నాడు. లెక్కలలో మనం నేర్చుకునే + గుర్తులాగా, చక్కగా, నిలువుగా, అడ్డంగా ఉండేటట్లు చింపుకు వచ్చాడు. నాకు వళ్ళు మండిపోయింది.

"ఏమిటోయ్ ! ఇలా గుడ్డలు చింపుకువస్తే, మాకు గుడ్డలు ఉతకనక్కరలేదు. వేరే ఎవడికైనా వేసుకుంటాము" అన్నాను గట్టిగా యిల్లు ఎగిరిపోయేటట్లు (నో, నో, పెంకులు అవీ సరిగానే ఉన్నాయి. ఊరికే అన్నాను.)

"మీరే. అలాగంటే, యెలా చెప్పండి ! మీ చొక్కా బాగా పాతది. అందువలన చిరిగి ఉంటుంది. అంతేకాని నాకు గుడ్డలు చిరిగిపోయేటట్లు బండకేసి బాదటం అలవాటు లేదండి" అన్నాడు వినయంగా.

వాడు చెప్పింది కొంతవరకు నిజమే ననిపించింది. నా చొక్కా పాతదికాబట్టి, చిరిగిపోయి ఉంటుంది అని మనస్సును సరిపెట్టుకున్నాను. కాని మా ఆవిడ వంక "ఏమి చేద్దామంటావు ?" అన్నట్లు ఒకసారి చూసేటప్పటికి "చూస్తారేమిటండీ ! గట్టిగా దబాయించక" అనే భావం 'దాని' కళ్ళలో కనిపించి, ఒక్కసారి మళ్ళీ పుంజుకుని,

"అయితే నా చొక్కా పాత. దంటావు ? చాలు చాల్లే ! ఎవరన్నా వింటే నవ్విపోతారు. అది కుట్టించుకుని మూడు నెలలు కాలేదు" అన్నాను బింకంగా. (మనలో మాట అది కుట్టించి ఏడాది దాటిపోయిందిలెండి ! అయినా చాకలివాడితో నిజం ఎందుకు చెప్పాలి ? ఏమంటారు ?)

భార్యాభర్తలమధ్య రాజకీయాలపై కీచులాటలువస్తే ఎలా ఉంటుందో అక్కడ చేరిన స్త్రీలు చర్చించుకుంటున్నారు.

"ఏం సుశీలా నువ్వు కాంగ్రెసువాదివి, మీ ఆయన కమ్యూనిస్టూ కదా మీరు ఎలా నెట్టుకొస్తున్నారు." ఒకరు అడిగారు.

"ఓష్ అంతేకదా! ఇద్దరం కలిసి కొత్త పార్టీ పెడుతున్నాము!"

రాజేశ్వరి (టి. నగర్)

"అదేమిటండీ ! అలా అంటారు ! ఇది మీరు కుట్టించుకుని ఏడాది దాటింది. ఇన్నాళ్ళనుంచి మీ యింటి బట్టలు ఉతుకుతున్నాను. నా కామాత్రం తెలియదంటారా ?" అన్నాడు.

సరే ! ఇక వాడితో పోట్లాడి లాభం లేదనిపించింది. అందుకని కాస్త రాజీపడే ధోరణిలో,

"అది కాదోయ్ ! గుడ్డలు కాస్త జాగ్రత్తగా ఉతుక్కోరూ ? .... మరీ అంత గుడ్డిగా బండకేసి బాదితే, చిరిగిపోక ఏమి చేస్తాయి !" అన్నాను.

"సరే ! జాగ్రత్తగానే ఉతుకుతానులెండి యికనుంచి" అన్నాడు నారాయణ.

"ఇదిగో మరో విషయం ! ఈసారి గుడ్డలు వారంరోజులలోనే తీసుకురావాలి ! .... లేకపోతే వూరుకోను !" అన్నాను దబాయింపుగా.

"అలాగే ! వీలయితే, తప్పకుండా తెస్తానండి."

"వీలయితే అంటే కుదరదు ! .... ఈసారి ఆలస్యంగా గుడ్డలు తెస్తే ఊరుకోను" అన్నాను మరింత గట్టిగా.

"సరే ! అలాగేలెండి !" అని గుడ్డలు (మాసినవి) వేయించుకుని తీసుకుపోయాడు.

అంతే ! మళ్ళీ పదిహేనురోజులుదాకా వాడు ముఖం చూపించలేదు. వాడి యింటికి వెళ్ళి మా గుడ్డలసంగతి జ్ఞాపకంచేస్తే తప్ప మా గుడ్డలు మళ్ళీ మా యింటికి చేరేటట్లు కనిపించటంలేదు. కానీ ప్రతిసారీ (వాడొక ఆఫీసర్ అయినట్లు) వాడింటిచుట్టూ నే నెలా తిరుగుతాను ?

"ఏమిటి చేయడం !" అని ఒకరోజు యింట్లో కూర్చుని ఆలోచించాను. నాకు ఏమి చేయటానికీ తోచలేదు. వాడిని మాన్పించి, మరొకణ్ణి కుదుర్చుకున్నా వాడుమాత్రం సరిగా గుడ్డలు తెస్తాడని నమ్మక మేమిటి ? కనుక అదేమీ లాభంలేదు ! .... వాడినే దారికి తీసుకురావాలి. కానీ, వాడు చెప్పిన మాట వినటంలేదే ! అయినా తప్పదు. ఆఫీసుకు మంచిబట్టలు వేసుకెళ్ళాలంటే, ఆత్మాభిమానం చంపుకుని, వాడికి కబురు పంపిస్తే తప్పితే, గుడ్డలు యింటికి చేరేఉపాయం కనిపించలేదు. కానీ ఎవరిచేత కబురు చేస్తాను ? మా కుర్రవాణ్ణి పంపిద్దామంటే, వాడికి గట్టిగా మాట్లాడటం చేతకాదు. పోనీ, ప్యూను నెవరినన్నా పంపిద్దామంటే, నా చేతిలో బంట్రోతులు ఎవరూ ఉండరు. అందువలన నేనే (కాసేపు బంట్రోతు ననుకుని) ఆ నారాయణ దర్శనం చేసుకుని, 'ఈ దీనుణ్ణి కనికరించు' అని మొరపెట్టుకోవాలి.

"ఛీ! ఛీ! వెధవపని ! వాడింటికి నేను వెళ్ళేదేమిటి ! వాడే, నా కాళ్ళముందు వచ్చి వాలాలి కానీ, నేను వాడింటికి మళ్ళీ వెళ్ళకూడదు. లోగడ వాడింటికి వెళ్ళివచ్చింది చాలు !" అని మనస్సులో అనుకున్నా, "వీడి దుంపతెగ! వాడింటికి వెళ్ళి విషయం కనుక్కోకపోతే, మరీ ఆలస్యం చేస్తాడు" అని మనస్సులో భయం పీక్కుతింటున్నది.

నేను 'యేమి చేద్దామా' అని ఆలోచిస్తూ ఉండగానే, శ్రీమతి కాఫీ తీసుకువచ్చి యిచ్చింది.

"ఏమిటండీ ! ఆలోచిస్తున్నారు ?" అంది.

"ఏమీలేదు ! చాకలివాడిసంగతే ఆలోచిస్తున్నాను" అన్నాను.

"దీనికి ఆలోచించటం దేనికి ? ఇంకొక డెవరయినా ఉంటే చూడండి !" అంది.

"సరే, అలాగే !" అని చెప్పి డ్రస్‌చేసుకుని చాకలివాడింటికి వెళ్ళి గట్టిగా కేకలేసి, అక్కడి నుంచి, బజారుకు వచ్చాను.

అక్కడ ఒక 'లాండ్రీ' షాపు కనిపించింది. అది చూడగానే నాకు చటుక్కున "వీడికి గుడ్డలు వేస్తే బాగుంటుంది" అనిపించింది. వెంటనే షాపులోకి వెళ్ళాను.

"నీ పేరేమిటి ?" అని అడిగాను.

"కోటయ్య" అని చెప్పాడు.

"ఏమీ లేదు ! బ్రాడీపేటలో, ఫలానీ లైనులో ఉంటున్నాము. పదోనెంబరు యిల్లు. మాకు గుడ్డలు ఉతకటానికి యింటికి వచ్చి తీసుకు వెళ్ళేవాడు కావాలి ! నువ్వు రాగలవా ?" అన్నాను.

"అలాగే" అన్నాడు. నేను ఊరుకోలేక "ఈ చాకలివాళ్ళతో పెద్ద పేచీగా ఉందోయ్ ! మా

# చాకలివాడు

ఇంట్లో గుడ్డలు ఉతికేందుకు ఒకణ్ణి కుదుర్చుకున్నాము. వాడి దుంపతెగ! వాడు పదిహేను రోజులయినా గుడ్డలు తీసుకురాడోయ్!" అన్నాను మాట వరుసకి.

"మీ యింట్లో యెవరు ఉతుకుతున్నా రేమిటి?"

"నారాయణ అని ఉన్నాడులే!"

"వాడా సార్! వాడు ఎప్పుడూ అంతేలెండి! ఆలస్యం చేయకుండా గుడ్డలు తీసుకురాడు. వాడివి మాన్పిస్తే ఏమిలెండి. మంచిపనిచేశారు. వాదగ్గర ఆలస్యం చేయడం అంటూ ఉండదు. మీరే చూస్తారుగా!" అన్నాడు.

"సరే, ఈరోజే, బట్టలు వేయించుకోవటానికి రా?" అని చెప్పి, యింటికి వచ్చేశాను.

కాసేపటిలో సైకిలుమీద కోటయ్య వచ్చి మా బట్టలు వేయించుకు వెళ్లాడు. 'అమ్మయ్య! బ్రతికిపోయాము. ఇక గుడ్డలు త్వరగానే వస్తాయి' అంటూ మా ఆవిడ నిట్టూర్చింది. నాకూ కాస్త 'రిలీఫ్' కలిగినట్లు అయింది.

మర్నాడు నారాయణ మా గుడ్డలు తీసుకువచ్చి యిచ్చాడు. వాడు రాగానే,

"ఇక నువ్వు నీ డబ్బులు లెక్కచూసుకుని తీసుకుపోవచ్చును" అన్నాను.

"అదేమిటండీ? అలా అంటారు."

"నీ బాధ పడలేక, లాండ్రీలో గుడ్డలు వేశాను" అన్నాను కోపంగా.

"ఏ లాండ్రీలో నండీ?"

"ఎవడో కోటయ్యట! వాడికి వేశాను"

"వాడికి ఎందుకు వేశారండి! నాతో ముందు చెప్పకపోయినారా!" అన్నాడు నారాయణ.

"ఏమి అలా అన్నావు?"

"వాడు మా బాబాయి కొడుకేనండి. వాడికీ నాకూ పోటీ! .... సరే, దానికేమిటిగానీ, గుడ్డలు మళ్లీ ఎప్పుడు తీసుకువస్తానని చెప్పాడు?" అని అడిగాడు.

"ఒక వారంరోజుల్లో తెస్తానన్నాడు."

"వట్టిది! ఇరవై రోజులయినా, మీకు బట్టలు తిరిగి రావు. వాడు యిదివరలో కొంతమంది బట్టలు పారేశాడండి? వాడంటే, ఊళ్లో ఎవరికీ నమ్మకం లేదు. మీకు గుడ్డలు వేయటానికి అంతకంటే మరొకడు దొరకలేదుటండీ!" అన్నాడు నారాయణ.

"ఏమిటోయ్! నువ్వు చెప్పేదంతా నిజమేనా!" అంది మా ఆవిడ ఆదుర్దాగా.

"నిజమేనండీ! అబద్ధం చెప్పవలసిన అవసరం నాకేమొచ్చిందండి?" అన్నాడు నారాయణ.

"అయితే, యేమి చేయమంటావ్?"

"ఏమీలేదు! ఇవేళే మీ గుడ్డలు మళ్లీ తిరిగి వచ్చే ఉపాయం ఆలోచించుకోండి."

"సరే, అలాగే! నువ్వు మళ్లీ రేపో, ఎల్లుండో కనిపించు" అన్నాను.

ఇంతకీ నారాయణమీద కోటయ్య చెప్పిన మాటలు నమ్మడమా! .... లేక కోటయ్య గురించి నారాయణ చెప్పింది నమ్మడమా? ఏమిటి చేయడం?



# చిత్రఖేదము

16వ పేజీ తరువాయి

న్నాడని ఎవరో అన్నారు. వాళ్ల ఊరెళ్లి పోయాడని ఇంకెవరో అన్నారు. మొత్తానికి ఆవిధంగా ఖేప' పడి, ఆ అబ్బాయి కనిపించకుండా పోయాడు. చూశారా ! ఇదంతా చిత్రఖేదం ! ఇన్ని బాధలు పడాలి. పడినా అవకాశం వస్తుందో లేదో ఎవరూ చెప్పలేరు" అని ముగించాను

ఆమె కోపంగా చూసి—"ఇవ్వనని అనరాదూ ? ఈ కథ అంతా ఎందుకు ?" అని చిరాగ్గా అని వెళ్లిపోయింది. ఆమెను నేను మళ్లీ పిలవబోయే సరికి, నాకు పిలుపొచ్చింది—లోపల్నుంచి దర్శకులు గారి వద్ద నుంచి !

"ఎవరది—నువ్వు మాట్లాడుతున్నావు ?" అని అడిగాడు దర్శకుడు

"ఎవరో—సినిమాల్లో వేషాలకోసం వచ్చింది."

"ఐతే, నువ్వు మాట్లాడటం ఏమిటి—ఇట్లా రమ్మను" అని గద్దించాడు

నాకు చాలా కోపం వచ్చింది —ఈ గద్దింపుకు నా వెళ్లి పిలిచాను ఆమె లోపలకు వెళ్లింది ను అక్కడే కూచున్నాను కాస్సేపటికి దర్శకుడు పిలిచాడు

"ఏమయ్యా—మంచీ మర్యాదా అక్కర్లేకుండా ఈమెతో కథలేవో చెప్తావుట— నిన్ను యిక్కడ కథలు చెప్పటానికా వేసుకున్నది ? ఆ ఇంటరెస్టుంటే కథకుడిగా ట్రై చేసుకోరాదూ ? .... అసలు ంబా ఫీల్డులో ఉన్న తెగులు ఇదేనండీ. ఎవడి పని వాడు చేసుకోడు. ప్రతిదాంట్లోనూ ప్రతీవాడూ తల దూరుస్తాడు ! ఐనా మన చిత్రంలో వేషాలు లేవని ఎవరు చెప్పారు నీకు ? అదిక ప్రసంగాలు ..."

ఈపాటికే నాకు కోపం బాగా వచ్చేసింది ఆమాటలింక సహించలేకపోయాను. లోపలున్న పౌరుషం పెల్లుబికింది ఆ పాతిక రూపాయలూ తీసి, టేబిలుమీద కొట్టి— "అయ్యా చాలా థాంక్స్ ! ఎంత అసిస్టెంటు డైరెక్టరు ఉద్యోగానికి నా ఖర్మం కాలి వచ్చినా, నాలోనూ మానం, పౌరుషం ఉన్నాయి. మీలాగే నేనూ దర్శకుడి హోదాలో ఉంటే, మీరన్న మాటలకు సమాధానం యిచ్చివుండేవాడిని. కాని ఈనాటి నా స్థితి వేరు. ఎంత పొట్టకూటికని సహాయ దర్శకుడిగా వస్తే మాత్రం ఇంత నీచంగా మాట్లాడతారా ? నన్ను తూలనాడటానికి మీకేం అధికారం లేదు ఇట్లా కాకపోతే అట్లా అని చెప్పండి అంతేగాని, నేనుంతా మీ కింద బానిసలం అని మాత్రం అనుకోకండి. సెలవు మీకో సెలవు—మీ ఉద్యోగానికి రెండు సెలవులు" అని ఉద్రేకంతో గడగడా అనేసి, దూకుడుగా బయట పడ్డాను. అంతే ! ఆ క్షణమే నిర్ణయం చేసుకున్నాను—ఇటువంటి డైరెక్టర్ల దగ్గర అసిస్టెంట్లుగా చెయ్యరాదని ! అంతకన్న పీక పిసికి ముస్పెట్టుకోవటం మేలు !



'ఇరుగు-పొరుగు'లో కృష్ణకుమారి.

శ్రీ కృష్ణసాయి ఫిలిమ్స్ వారి "మాయా మోహిని"లో రంజని

# చిత్రఖేదము



'విక్రమార్క వీరుడు'లో అంజలీదేవి.

ఫలానా యిచ్చిన అర్ధరూపాయితో ఆపూట గడుపుకున్నాను. మధ్యాహ్నం అంతా ఎండలో తిరిగాను. ఎందుకు తిరిగానో తెలీదు గాని, ఉద్యోగం కోసం మాత్రం కాదు! సాయంత్రం పార్కువేపు వెళ్ళేసరికి, బెంచీమీద ఫలానా కూచుని ఉన్నాడు.

"రండి గురూగారూ, బెంచి చిన్నదేంకాదు కదండీ" అంటూ ఆహ్వానించాడు. అతని ప్రక్కనే కూచుని, జరిగిందంతా చెప్పాను.

అంటారు. సరే, గురూ—చిన్న కథ చెబుతాను—అంతా విని సమాధానం చెప్పాలి. ఏమిటంటే, ఒక ఊళ్ళో ఒక డబ్బున్నవాడున్నాడు. అతనికో కుమార్తె ఉంది. ఆమె పేరు నిర్మల. ఈ నిర్మల ఒక బీద కుర్రవానిని ప్రేమించింది. అతనూ ప్రేమించాడు కాని ఆ తండ్రి—'లైలా మజ్నూ' ఫాదర్ లాంటివాడు! కుర్రవాడిని చంపేస్తానన్నాడు. ఆ అమ్మాయిని, బయటకు పోనివ్వకుండా కట్టడి చేశాడు. ఐనా, వాళ్ళ ప్రేమ మానలేదనుకోండి గురూజీ—చెప్పండి. ఈ ప్రేమ ఏమవుతుంది? ఫలిస్తుందా? విఫలిస్తుందా? .... ఆలోచించి చెప్పండి."

"నాకు తెలీదు" అన్నాను.

"అయ్యో గురూజీ—ఆ ప్రేమ జయిస్తుంది గురూ! ఎట్లాగంటారా—నిర్మలప్రేమ జయిస్తుంది కాబట్టి! బావుందా? ఊరికే, సీరియస్ సీన్ మధ్య హాస్యపు సీనులాగా, ఈ ఖేదం మధ్య చిన్న తమాషా. అన్నట్టు—ఈ రాత్రి నాకో కాల్‌షీటుంది గురోయ్!"

"ఆదెక్కడ?"

"ఫిల్మ్ స్టుడియోలోనే. ఒక చిన్న వేషం ఉందిట, నన్ను వెయ్యమని బలవంతం చేశారు. నా కసలే తీరికలేదన్నాను. ఇప్పటికిప్పుడు కాల్‌షీటు అడిగితే ఎక్కడ తీసుకురాను అన్నాను. వాళ్ళ బ్రతిమాలారు. ఐతే నైట్ వేసుకోమన్నాను. తెల్లారేప్పటికల్లా, పిక్చర్లోని నా వేషం అంతా కంప్లీటు చేసేసి, ఎనిమిదింటికల్లా ఈ బెంచీమీద కూచో మన్నాడు. పోతూ పోతూ అతనొచ్చి నన్ను తీసుకుపోతాట్ట! ఆదేం కుదరదు, ఎనిమిదింటి కయితే భోజనం నువే పెట్టించు అన్నాను. నా దగ్గరా వేషాలు? ఏంలేదు, నాకు భోజనం పెట్టించినట్టు లెఖ్ఖచెప్పి, ఆ రూపాయి డబ్బులూ జేబులో వేసుకుంటాడు. అన్నట్టు — నా దగ్గరో రూపాయుంది. ఎక్కడిదని అడక్కండి. దొంగతనంచేసి సంపాయించింది మాత్రం కాదు. మీరు వెళ్ళి భోజనంచేసి రండి. ఖేదంలో నయినా మోదపడుతూ ఉంటే, డబ్బులు యిట్లాగే వస్తూవుంటాయి. ఇందండి" అని రూపాయిచ్చాడు.

నేనేమీ అనలేదు. తీసుకొని, జేబులో వేసుకున్నాను.

"ఈ ఇండస్ట్రీ మరి బాగుపడదేమిటోయ్ ఫలానా!" అన్నాను.

"ఇండస్ట్రీ కేమండి—నిక్షేపమల్లే ఉంది. ఎటొచ్చీ మనం బాగులేముగాని. మనం బాగా లేకపోయినంత మాత్రాన ఇండస్ట్రీని ఎందుకండీ తిట్టడం! నాలుగు రోజులిటూ, నాలుగురోజులటూ! కాస్త బాగున్నాం అనేసరికి ఇంక కలకాలం అట్లాగే ఉంటాం కాబోలని అనుకోడం మాత్రం పనికిరాదు. సినిమా పరిశ్రమలో ఎప్పటికి నిలబడగలిగినట్టో మనం చెప్పలేము. ఒక చిన్న కథ చెబుతాను, ఖేదం మాని వినండి .... ఏమిటంటే—ఆమధ్య కొత్తగా ఒక అమ్మాయి చిత్రాల్లోకి వచ్చింది. చాలాకాలంనుంచి ట్రై చేస్తూనే ఉందనుకోండి. నాలుగేళ్ళ ప్రయత్నానంతరం చిత్రాల్లో చిన్నచిన్న వేషాల్లో ప్రవేశించి, క్రమక్రమేణా పెద్ద వేషాలు వేసింది. సెకండు హీరోయి నయింది. అంతకుపూర్వం, ఎవరేనా ఏం పిక్చర్లో ఉన్నావని అడిగితే, ఫలానా



అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ సంజీవయ్య, గౌరవార్థం గౌతమీవారు తమ "మహామంత్రి తిమ్మరుసు" చిత్రం ఎ. వి. యం. స్టూడియోలో ప్రత్యేకంగా ప్రదర్శించిన సందర్భంలో వారితో ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య శ్రీ ఎస్. వి. పి. పట్టాభి రామారావు తదితర నట, సాంకేతిక బృందం.

"మంచిపని చేశారు గురూజీ! మీకెందుకు గురూ, నిజం నిలకడమీద తేల్తుంది! సత్యమే జయం! .... ఉన్నమాటంటే ఉలుకెక్కువ! .... ఇటువంటి విలన్లంతా 'ది యెండ్' ముందు శిక్ష పొందుతారు. అంటే గురూ, పిక్చర్ అని కాదు నా వుద్దేశం! వాళ్ళ లైఫ్‌లు 'ఎండ్' ముందు అన్నమాట! .... అదేమిటండీ, అట్లా ఖేదపడిపోతున్నారు మరీనూ, పిల్లాడు తప్పిపోయిన హీరోయిన్‌లా! మానవజీవితమందు ఖేదమోదములు రాత్రి పగళ్ళ వంటివి. ఎండా, వెన్నెలా వంటివి. కలకాలం కాపురం ఉండని వాటినే కష్టాలని చెయ్యాలన్నాను. అన్నింటికీ వాళ్ళ ఒప్పుకున్నారు!" అని నవ్వాడు.

"కొత్తా?" అన్నాను.

"కొత కాదండి, నిజంగానే వేస్తున్నా. చిన్న వేషంట—ఈ రాత్రి మాత్రమే ఉంటుంది. ఊరికే చెప్పాను. మీకు తెలీదులెండి. ఈ ఇండస్ట్రీలో అట్లాగే చెప్పాలి. లేకపోతే పెద్దవాళ్ళం కాలేముట.'

"నాకేం తోచటంలేదోయ్."

"మీకెందుకు—మీరూ రండి, నాతో షూటింగుకు. హాయిగా ఉంటుంది. అన్నట్టు గురూ, ఆ ప్రొడక్షన్ మానేజరు గట్టివాడు. నన్ను భోజనం పిక్చర్లో 'సిక్స్త్ హీరోయిన్‌నండి, సెవెన్త్ హీరోయిన్ నండి' అని చెప్పేది. అంతేగాని మామూలుగా చెప్పేదికాదు. అక్కణ్ణుంచి అట్లా అట్లా సెకండ్ హీరోయిన్‌కు వచ్చింది. ఐదారు చిత్రాలొచ్చాయి. దాంతో టెక్కు బలిసింది. నాకేం అనుకుంది, అసలా అమ్మాయిని, అట్లా తయారుచేసింది వాళ్ళ నాన్నలే! పెత్తనం అంతా ఆయనదే. ఇంటికొచ్చిన ప్రొడక్షన్‌వాళ్ళమీదా, చూడటానికి వచ్చిన వాళ్ళమీదా, జర్నలిస్టులమీదా ఎగిరేవాడు. చేతిలో పత్రిక ఉంది కాబట్టి జర్నలిస్టులు తెగ రాసేవారు, ప్రొడ్యూసర్లూ వాళ్ళూ వేషాలు యివ్వటం మానేశారు. నాలుగు చిత్రాలు తాగానే కాంట్రాక్టు



సి. కే. సి. వారి "పతిగౌరవమే సతికానందం"లో చలం, జానకి.



"అమరశిల్పి జక్కన్న"లో బి. సరోజాదేవి.

# చిత్రఖేదము

కొన్నారు. షూటింగుకు ఆలస్యంగా వెళ్ళటం, వెనకాల పనిమనిషినీ, పెద్ద పెద్ద బాస్కెట్లనూ, ఫ్లాస్కులనూ తీసికెళ్ళటం, కాల్‌షీటులో ఇంకా టయిముండగానే వెళ్ళిపోతా ననటం—ఇవన్నీ నేర్చుకుంది. దాంతో అందరికీ మొహం మొత్తింది. 'ఓసి దీని గర్వం' అనుకున్నారు. ఇదే శాశ్వతమనీ తనెప్పుడూ ఇట్లాగే ఉంటాననీ అనుకుందామె. ఆమెమీద అందరికీ అసహ్యం పుట్టింది. ఆమె గురించి అందరూ విన్నారు. రానురాను వేషాలు తగ్గిపోయాయి. కొన్నాళ్లకు కారు అమ్మేశారు. పెద్ద ఇల్లు మార్చేసి, చిన్న ఇంటికి పోయారు. ఇప్పుడెక్కడా వేషాలు లేవు. మళ్లీ మొదటి స్థితికి వచ్చి—ఖేద ఘట్టాల్లో పడి కొట్టుమిట్టాడుతోంది.



శ్రీ సముద్రాల షష్టిపూర్తి ఉత్సవ సందర్భాన తీసిన చిత్రం.

విన్నారా గురూగారూ—మిడిమిడి భాగ్యాన్ని చూసి మురిసిపోతే ఎంత అవకతవకో! దీన్నే 'నడిమంత్రపు సిరి' అంటారు. తానప్పుడే ఫీల్డంతా కొనేసే దానిలాగా మాట్లాడేది. ఇప్పుడేమయింది? అంచేత ఈరోజు వేషం వచ్చిందని నేను పొంగిపోకూడదు. మీ దగ్గర రూపాయుందని మీరు ఉబ్బిపోకూడదు." అని తేల్చాడు ఫలానా.

"ఏం?" అన్నాను.

"ఏంలేదు. ఊరికే. మూమెంటు ఒక్కలాగే ఉండదని, కాస్త మార్చాను. గురూజీ—వాళ్లెవరో డబ్బింగు చిత్రం తీస్తున్నారట—"

"డబ్బింగు చిత్రం తియ్యడ మేమిటోయ్?"

"అదేలెండి—డబ్బింగు చేస్తున్నారుట—ట్రై చెయ్యరాదా? ఏదయినా పాత్రకు గొంతు ఇద్దురు గాని!"

"వద్దులేవోయ్—మనకు లేనిపోనిది. ఒక్కటి చెబుతా విను. మనకు తెలియనిదాని జోలికి మనం పోకూడదు. పోతే ముప్పు తప్పదు."

"దానిమీద కథ చెబుతారా ఏమిటి కొంపదీసి—వద్దు లెద్దురూ—వినే ఓపిక లేదు .... అదెవరు గురూగారూ, మన సలహాలా ఉన్నాడు గదూ .... ఉండట మేమిటి—ఆయనే! ఏమండోయ్ ..... సలహాలవారూ, రండి .... రండి" అని పిలిచాడు ఫలానా. ఎటో పోతున్న సలహా మావేపు చూసి, మా దగ్గరకు వచ్చాడు! (సశేషం)

---

ఇద్దరు మనుష్యులు జోరుగా పోట్లాడుకుంటున్నారు. చిలికి చిలికి గాలివాన ఐన ఆ తగాదాలో 'క' అన్నాడు. 'నేను కోపం వస్తే మనిషినిగాను తెలుసా?'

'గ' అడిగాడు. "తెలీదు. ఏమిటేమ్?" అని "దున్నపోతును" మండిపడ్డాడు "క" గారు.

"ఐతే సరే! నీ కోసం మా పాలేరును పంపుతా" నంటూ కదలిపోయాడు. "గ" ★

స్త్రీలలోనూ లేకపోవచ్చును. కాని, మానసికంగా అటువంటి గీతను ఊహించడం నేర్చుకోవాలి.

ఈ రేఖ ఉదరం ముందుభాగమును కుడి ఎడమ భాగములుగా విభజిస్తుంది. ఈ గీతకు క్రిందుగాం ఉండే అంగములూ అంగభాగములూ చిత్రములో చూపబడినవి. అవి (1) లివరు యొక్క ఎడమఖండము (Left Lobe), (2) జఠరాశయములో ఒక భాగము. (కడుపు ఖాళీగా ఉన్నప్పుడు ఆ అంగము లోపలకు పోతుంది), (3) పెద్ద ప్రేగు అడ్డభాగము. (పెద్ద ప్రేగును ఇంగ్లీషులో కోలన్ (Colon) అంటారు. కోలన్ కుడిడొక్క క్రిందిభాగంలో తొంటె ఎముక ప్రక్కనుంచి ఆరంభమై, పైకిపోయి, లివరు క్రింద ఎడమవైపుకు వంగి మళ్ళీ స్ప్లీను క్రింద క్రిందికి వంగి ఎడమడొక్క క్రిందిభాగంలో మధ్యరేఖవైపుకు వంగి, రెక్టంగా (Rectum మలాశయము) అంతమవుతుంది. కోలన్‌ను ఆయుర్వేదపరిభాషలో "స్థూలాంత్రము" అంటారు. (లావైనపేగు) దీనిలో ఊర్ధ్వముఖ భాగము (Ascending Colon తిర్యగ్భాగము (Transverse Colon) అధోముఖ భాగము అని మూడుభాగము లున్నవి. అందులో తిర్యగ్భాగము మధ్యరేఖకు వెనుక ఉంటుంది. ఇది రూళ్లకర్ర లాగా నిడుపుగా ఉండదు. పూలమాలలాగా క్రిందికి వంగి ఉంటుంది. ఈ వంపు క్రింది అంచు బొడ్డు దాకా దిగిఉండవచ్చును. (4) చిన్న ప్రేగు చుట్టలు (Coils of small Intestine) దీనిని ఆయుర్వేదభాషలో క్షుద్రాంత్రము అంటారు. (5) మూత్రపూరితమైనప్పుడు మూత్రాశయమూ, గర్భవతులలో (6) గర్భాశయమూ Uterus ఉదరకుడ్యము (Abdominal wall) లో నుంచి ముందుకు చొచ్చుకొని చేతికి తగులుతూ ఉంటవి.

రెండవ ఊహారేఖను అర్ధచంద్ర రేఖ అంటారు. (Linea semilunaris) (లూనా అంటే చంద్రుడు. సెమి అంటే అర్థ. లైనియా అంటే రేఖ) ఇది. 7 వ పక్కటెముక క్రింది నుంచి ప్యూబిస్ అస్థికొనవరకు వంకరగా ఉంటుంది. రెండు ప్రక్కలా రెండు రేఖలు ఉంటవి. మామూలుగా ఉన్న ఉదరములలో ఇది బొడ్డుకు మూడు అంగుళముల దూరములో ఉంటుంది. బాన పొట్టల వారిలో ఇంకా దూరంగా ఉంటుంది. కుడి అర్ధచంద్రరేఖ పైకొసకు కాస్త వెలుపలగా పసరుతిత్తి (Gall bladder) ఉన్నది. ఎడమవైపున స్ప్లీనుభాగము ఉంటుంది.

తిర్యగ్రేఖలు Linea Transversalis మూడు : ఇవీ ఊహారేఖలే. ఒకటి బొడ్డు లెవెలులో ఉంటుంది. రెండవది స్టెర్నం క్రింది మొనలెవెలులో ఉంటుంది. మూడవ ఊహారేఖ ఈ రెంటికీ మధ్య ఉంటుంది. ఇవికాక ఉదరము ముందుభాగము, కొన్ని ఊహారేఖల మూలంగా

# మనమూ-మన దేహస్థితి

13-వ పేజీ తరువాయి

తొమ్మిది భాగములుగా విభజించబడినది. వీటిని చిత్రములో చూడవచ్చును. పై విభాగంకంటె ఉదరంలో అంగములు ఉండే చోటును నిర్ణయించడానికి ఈ విభాగం చాలా సహకరిస్తుంది.

ఉదరంలో మార్పులను గమనించాలంటే మంచి వెలుతురున్నచోట రోగిని వెల్లకిలగా పడుకోబెట్టాలి, పొట్టమీద గుడ్డలన్నీ తీసివుంచాలి. ఉదర పరీక్షకు పూనుకునేముందు మూత్రవిసర్జనచేయించాలి. కంటితో ఉదరమును పరీక్షిస్తున్నప్పుడు దాని ఆకృతి మామూలుగా ఉన్నదో, ఉబ్బిఉన్నదో, వెనుకవైపుకు అంటుకుపోయివున్నదో, కుండలాగా భాండీకరించివున్నదో గమనించాలి. ఉదర కుడ్యము Abdominal wall) ఒకేవంపుతోవున్నదో లేక ఒకచోట అధికంగా ముందుకు పొడుచుకుని

---

"మీరు సిగరెట్ త్రాగటం మానెయ్యాలి" రోగికి డాక్టరు సలహా చెప్పాడు.

"సిగరెట్లు మానేస్తేనా జబ్బు నయమవుతుందంటారా?" రోగి ఆశగా అడిగాడు

"ఆ సంగతి ఎలా ఉన్నా ముందు నా సోఫా నాకు దక్కుతుంది." డాక్టరు ముక్తసరిగా అన్నాడు.

సుమతి (ఒంగోలు)

---

వచ్చిందో పరిశీలించాలి. పొట్ట ఉబ్బివుండడానికి కారణములు: (1) క్రొవ్వు (Fat) (2) ద్రవపదార్థములు Fluids) (3) గాలి. (Faitus 4) బిడ్డ Flatus). 'ఇందులో' బిడ్డ స్త్రీలలోగాని వుండదు. 'కొవ్వు' 'ద్రవము' 'గాలి' పొట్ట ఉబ్బరించడానికి ముఖ్యకారణములు. ఇవికాక కడుపులో ఏర్పడే నూతనవృద్ధులు (ట్యూమర్లు) ఉదరమును పెద్దవిచేయవచ్చును. కాని, అప్పుడు ఉదరమంతా ఒకేతీరుగా పెద్దదికాదు. ఏదోఒక చోట ఎగుడుదిగుడుగా వుంటుంది. వీటిలో దేని వల్ల ఉదరంఉబ్బివున్నదో నిర్ణయించడం తెలుసుకోవాలి. ఈ ఉబ్బు ఉదరం 9 భాగములలో దేనికైనా సంబంధించివున్నదా గమనించాలి. ఈ ఉబ్బు ఊపిరితీసినప్పుడు కదులుతున్నదా లేదా చూడాలి.

ఒక్కొక్కప్పుడు ఉదరోపరిభాగంలో నాడి కొట్టుకుంటూ చేతికితగుల్తూ వుంటుంది. పొట్టమీది నాడి తగలడానికి ముఖ్యకారణములు. (1). హృద్రోగము. (2). లివరునుంచివచ్చే లివరువెయిను ఉబ్బడం (3). అయోర్టా (Aorta) స్పందనము నైతికదౌర్బల్యం (అయోర్టా శరీరం క్రిందిభాగానికి పోయే ఆర్టరీ) (Nervous Weekness). ఈవ్యాధులున్నవారిలో ఈ లక్షణం తరుచు కనిపిస్తుంది.

ఉదరం ముందుభాగంలో ఊహానిర్మితము లయిన తొమ్మిదిభాగములలోనూ ఏఏ అవయవము లున్నవో తెలుసుకుని, ఆయాభాగములలో మార్పు ననుబట్టి, ఏఏ అంతరంగములు వ్యాధిగ్రస్తములైనవో ఊహించవచ్చును.

కుడి హైపోకాండ్రియంలో (1) లివరు కుడిఖండం (Right lobe) (2) కోలన్‌లివరువద్దవంపు Hepatic Flesion of Colon (3). కుడికిడ్నీ ఉంటవి.

ఎపిగేస్ట్రిక్ భాగంలో లివరు కుడిఖండంలో కొంత, ఎడమఖండము, పసరుతిత్తి: జఠరాశయంలో కొంతభాగము డువోడినంలో మొదటి రెండుభాగములు, పేంక్రియస్ స్ప్లీను పైకొన, కిడ్నీలలో కొంతభాగము. వాటిమీదవుండే ఎడ్రినల్ గ్రంధులు.

ఎడమ హైపో కాండ్రియములో లివరు ఎడమ ఖండములో కొంతభాగము. జఠరాశయములో భాగములు. కోలను స్ప్లీను వంపు, ఎడమకిడ్నీలో భాగము.

కుడిజఘనభాగంలో Right Lumbar కుడికిడ్నీభాగము. కోలన్ ఊర్ధ్వముఖభాగము. చిన్నప్రేగు రెండవభాగము.

నాభిభాగంలో కిడ్నీలలో భాగములు, కోలన్ తిర్యగ్భాగము. (Transverse Colon) డువోడినంలో ఒకభాగమూ చిన్నప్రేగుచుట్టలు. ఒమెంటం (Omentum) అనే నిర్మితి (ఇది ఉదరంలో అవయవములను కమ్మిఉంటుంది) జఠరాశయ భాగము.

ఎడమ లంబార్ భాగంలో ఎడమకిడ్నీ, కోలన్ అధోముఖభాగము (Descending Colon) చిన్నప్రేగు పైభాగము ఉంటవి.

కుడితుంటెప్రదేశము (Right Iliac regriom) లో చిన్నప్రేగు చివరిభాగమూ, సీకం Caecum) అనివ్యవహరించబడే పెద్దప్రేగు మొదటి భాగము, దానిని అంటిఉండే ఎపెండిక్సు హైపోగేస్ట్రిక్ ప్రదేశము (కడుపుక్రిందప్రదేశము అని ఈమాట కర్థము. కాని యిది బొడ్డుక్రిందఉంటుంది) లో చిన్నప్రేగుచుట్టలు, రెక్టంపైభాగమూ, చిన్నపిల్లల్లో మూత్రాశయమూ మూత్ర పూర్ణమయినప్పుడు పెద్దల మూత్రాశయము, గర్భవతులలో గర్భము వుంటవి. మూత్రములేని మూత్రాశయము పిండములేని గర్భాశయము ఈ ప్రదేశంలో కనపడవు. ఎడమతుంటెభాగములో చిన్నప్రేగు భాగములు, సిగ్మాయిడ్ అనే ప్రత్యేకనామము కల అధోముఖకోలను, (Descending Colon)

ఏభాగంలో ఏ అంతరంగముల భాగము లున్నవో తెలుసుకొని జ్ఞప్తివుంచుకుంటే ఆయా ప్రదేశములలో మార్పులు ఏయే ఉపాంగానికి సంబంధించినవో ఊహించవచ్చును. (సశేషం)







POND'S
DREAMFLOWER TALC
DREAMFLOWER TALC




POND'S
DREAMFLOWER TALC

# విశాలనేత్రాలు

9-వ పేజీ తరువాయి

గుయుడు బారెడు దూరంలో నిలబడి చిన్న చిన్న నిమ్మకాయ లదేపనిగా విసురుతున్నాడు! చిన్ననాటి నించి నేర్చుకొన్న సాము చాకచక్యంతో అవి తన కేమాత్రము తగులకుండా రంగనాయకు డెంతో మెళకువతో తప్పించుకొంటున్నాడు. తప్పి జారి ఒక్క కాయ తగిలినా సరే, అతడు ఓడిపోయి నట్టే! అలాగ ఇంచుమించుగా ఒక అరగడియ గడిచిన తరవాత రంగనాయకు డొక పొడుగాటి కరవాలంతో కత్తిసాము ప్రారంభించాడు. గోపాలయ్య ఇనుమడించిన పట్టుదలతో మళ్లీ అతనిమీద నిమ్మకాయల జడివాన కురిపించాడు. అయినా రంగనాయకు డెక్కడ చెక్కు చెదరలేదు! బాణాకర్ర శరవేగంతో గిరగిర తిరిగింది! తుత్తునియలయిన నిమ్మకాయ లన్నివైపుల రివ్వురివ్వుమని చెంగలించాయి! మరికొంతసేపటికి గోపాలయ్య తన పరీక్ష ముగించి 'రంగన్నా! ఈవేళ గెలుపు నీదే! నేనే ఓడిపోయాను!' అన్నాడు. అప్పటి కతని పక్కన పేర్చిన నిమ్మకాయల గుట్టలన్నీ అయిపోయాయి!

క్రమక్రమంగా రంగనాయకుని బాణాకర్ర విసురు తగ్గింది. 'అమ్మయ్య!' అని అత డా బాణా కొనమీద కొంచెం ఆనుకొని విజయగర్వంతో వీర్ర పీగుతూ హేలగా చిరునవ్వు చిందిస్తూ నిలబడ్డాడు. గోపాలయ్య మొట్టమొదట తన మిత్రు డా పరీక్షలో అంత గొప్పగా నెగ్గగలడని ఊహించి ఉండలేదు. 'రెండు మూడు కాయలయినా తగలకపోతాయా!' అనుకొన్నాడు. అందుచేత ఆనందం పట్టలేక ఎంతో ఆప్యాయంగా కౌగలించుకొని అనేకవిధాల అభినందించాడు.

రంగనాయకుని కప్పటి కింకా ఇరవై అయిదవ యేడు నిండలేదు! కాని బాగా కండలు తిరిగిన బలిష్ఠ దేహంతో, మూడు పదులు నిండీ నిండనట్టు మిసమిస లాడుతున్నాడని గోపాలయ్య ఆశ్చర్యపడ్డాడు. విశాలమయిన నెన్నుదుటితో, కొనలు తేరిన కనుదోయితో, కొంచెం లేతరంగు ఎర్ర మన్ను పైపూతతో మేళవించిన శరీరచ్ఛాయతో అత డెంతటి నెరజాణ నయినా ఇట్టే వలలో వేసుకోగలడని గోపాలయ్య గట్టి నమ్మిక. అయితే ఆట పాటలలో ఆరితేరిన వారవనిత లంతటి బేల గుండె కలవారు కాజాలరని అతనికి తెలియక పోలేదు. అయినా నెచ్చెలి కనుముక్కుతీరుపై అతని కంతటి గౌరవం కలిగింది! అంతేకాదు! అందాల రాశి హేమసుందరి కతని మీద, అందచందాలమీద పెంపెక్కిన మక్కువ కూడా అంతగా ఆశ్చర్యం కలిగించలేదు. కాని క్రమక్రమంగా ఆ వ్యామోహంలో పడి రంగనాయకు డేమయి పోతాడో అన్న భయం కలిగింది! అంతకుమునుపు గోపాలయ్య అతని ననేక పర్యాయాలు ఆ గొడవలో పడవద్దని గట్టిగా హెచ్చరించాడు. కాని రవంతయినా ప్రయోజనం కలగలేదు! రంగనాయకుని కన్న గోపాలయ్య రెండు మూడేళ్ళ పెద్ద. అందుచేత అతని మాట కెదురాడలేక రంగనాయకు డప్పటికి అలాగే అని అంగీకరించినట్టు నటించాడు. అంతేగాని రవంతయినా, తన ధోరణి విరమించలేదు. 'మొట్టమొదటినించి ఇదే వరస! తనకి ఎంత తోస్తే అంత! అంతేగాని ఇంకొకరి మాట చెవి కెక్కనీయడు రంగన్న! ఎన్నెన్ని విధాల మొత్తుకుంటే మాత్రం ప్రయోజన మేమిటి?' అని తనలో తాను సమాధానపడ్డాడు గోపాలయ్య.

చిన్ననాటినించి రంగనాయకుని కంతగా చదువు సంధ్య లబ్బలేదు. అయితే ఆ విషయమై వెంకటనాయకు డంతగా పట్టించుకోలేదు. ఏదో కొంత కొండ్ర ఉన్నది కదా! అది దున్నుకుంటే చాలదా? తన తండ్రి, తాత మాత్రం అంతగా చదువుకొన్నారా! అని చూచీ చూడనట్టు మాట్లాడ కూరుకున్నాడు. రంగనాయకుని కెంతసేపు సాము గరిడీల మీదే దృష్టి! ఇటీవల విలువిద్యమీద కూడా కొంత అభినివేశం కలిగింది. అంతేగాని పొలం పనుల వైపే అతని చూపు మరలలేదు. వెంకటనాయకు డది కనిపెట్టకపోలేదు. అయితే కొంచెం సంసార భారం మీదపడిన తరవాత దారికి రాకపోతాడా అని సమాధానపడ్డాడు. అదీగాక రంగనాయకుడు కొడుకు లందరిలోను చిన్న. చిన్నతనంనించి ఎంతో అల్లారుముద్దుగా పెరిగినవాడు. వెంకటనాయకుని ఉపేక్షాదృష్టి కది ఒక ప్రధాన కారణమే. ఇటీవల రంగనాయకుని దుందుడుకుచేష్టలెక్కువయినాయని విన్న తరువాత, త్వరలోనే వివాహం జరిపించి ఒక ఇంటివాణ్ణి చెయ్యాలని సంకల్పించుకొన్నాడు. కాని అనుకున్నంత మంచి సంబంధం ఏదీ కలిసిరాలేదు.

సాము పరీక్ష ముగిసిన తరువాత స్నేహితు లిద్దరు చెరొక విల్లు చేపట్టి రకరకాల బాణాల ప్రయోగ లారంభించారు. అంతలోనే రంగనాయకుడు రెండు మూడు సారులు తన వింటినారి సారించి ఉక్కు కొన అమర్చిన బాణం ఒకటి ఎక్కుపెట్టి అల్లంతదూరంలో కనిపిస్తున్న గోపాలస్వామి ఆలయం ధ్వజస్తంభంపైపు గురిచూచి 'గోపాలయ్యా! ఇది సూటిగా వెళ్లి ఆ ధ్వజస్తంభం కొనకి తగిలి గంటలు గణగణమని మారుమోగితే, ఈ వేళ నే ననుకున్న పని జరిగినట్టే! లేకపోతే మరి కాదన్నమాటే!' అన్నాడు

మరు క్షణంలోనే ఆ బాణం రివ్వుమని దూసుకుపోయి, ధ్వజస్తంభం కొనతో ఢీకొన్నది. చిరుగంటల సవ్వడి వారిద్దరి హృదయాలలోను మంద్ర మధురంగా ప్రతిధ్వనించింది. రంగనాయకుడు పట్టరాని ఆనందావేశంతో ఉప్పొంగి 'సరే, మరి నీ బాణం విడిచిపెట్టు!' అన్నాడు. 'ఇది ఆ గోపురం పై అంతస్తులోనించి దూసుకుపోతుంది చూడు!' అన్నాడు గోపాలయ్య. కాని అత డన్నట్టు జరగలేదు. 'అయ్యో! అని వేలు కరుచుకున్నాడు గోపాలయ్య. 'అన్నీ మనం అనుకున్నట్టు జరుగుతాయా!' అని ఓదార్చాడు రంగనాయకుడు.

ఆనాడు చైత్రపూర్ణిమ. ఆ వెన్నెల వెల్లువలో గోపాలస్వామి ఆలయం అపు డప్పుడే వికసించిన పెద్ద తెలికలువపూవులా తరళించింది. దేవళంలో భక్తుల శ్రీ సూక్త పురుష సూక్తాల కోలాహలం జేగంటల పెనుసవ్వడులలో స్పష్టాస్పష్టంగా వినిపించింది. తీర్థ ప్రసాదాలు తీసుకున్న తరువాత స్నేహితు లిద్దరు ఆలయం లోలోపలి ప్రాకారం

## మధుర ప్రకృతి

కుమారి ఆవుల ప్రమీలాదేవి

చిలకమ్మల కలకలలో
సెలయేటి గలగలలలో
మధురమైన మంజులగానం
వినిపించును వీనుల విందై!
వికసించిన విరికన్నెలు
చిగురించిన చిటారుకొమ్మలు
కలకల నవ్వులతో
కనుపించును కన్నుల కింపై!
తారకల తళతళలో
చిగురాకుల మిలమిలలో
మహనీయుల మనసులలో
ప్రకాశించు ప్రశాంతత
మహోన్నత శిఖరాలు
అంబర చుంబిత సౌధాలు
మానవతా మహోన్నతినే
చాటుచున్నవి వేనోళ్ళ
హంపీనగర శిథిలాలు
మోడువారిన వృక్షాలు
వినిపించును దీనముగ
విషాదాంత కథలెన్నొ
శరత్కాల నిశీధిలో
ప్రకాశించు చందమామ
వెన్నెలవెలుగులతో లోకానికే
అందించును అమరసందేశం
అరవిరిసిన మల్లెలు
పాలరాతి ప్రభలు
నిర్మల హృదయాలకు
నిదర్శనముగ నిల్చియున్నవి!
విరిగిపడే కెరటాలు
పురివిప్పిన మయూరాలు
కవిచంద్రుల హృదయాలకు
కలిగించును కమ్మని భావాలు
పాపాయి చిరునవ్వులో
పండువెన్నెల పకపకలో
పాలనురుగు పరుగులలో
వర్షించును అమృతధారలు. ★

## రచయితలకు విజ్ఞప్తి

రచయితలు తమ రచనలతోను, రేఖా చిత్రములతోను, తగినన్ని తపాలా బిళ్ళలు అంటించి, చిరునామా వ్రాసిన కవర్లు జతచేసి పంప కోరుతాము. అట్లా పంపితేనే నిరాకరించిన రచనలను మరి కొంత త్వరగా త్రిప్పి పంపటం సాధ్యమవుతుంది.

టట్టూ ప్రదక్షిణ నమస్కారా లారంభించారు. అవి ముగిసిన పిమ్మట దేవాలయం ఆవరణంలో ఉన్న పుష్కరిణి గట్టుమీద చదికిలబడి ఇష్టాగోష్ఠి ప్రారంభించారు.

స్వామి సందర్శనం కోసం గుమిగూడిన జనం క్రమక్రమంగా పలచబడ్డారు. అర్చకులు కూడా తిరిగి వెళ్లిపోయారు. అప్పటి కర్ధరాత్రి కావ స్తుంది. గోపాలయ్య లేచి నిలబడి మరి వెళ్లి పోదామా అన్నాడు. కాని రంగనాయకుడు ప్రతి సమాధానం చెప్పలేదు. ఏదో ఆలోచిస్తూ అలాగే కూర్చుండిపోయాడు :

'నేను తలపెట్టిన పని ఇంకా పూర్తికాలేదు. అపరాత్రివేళదాకా నాతో కలిసి తిరిగితే మీవా ళ్లేమయినా అనుమాన పడతారేమో ! పోనీ నువ్వు వెళ్లిపో !' గోపాలయ్య రవంతసేపు అతనివైపు చూసి ' నీ ఆలోచన నాకు తెలిసిందిలే ! గోపురం మీదికి పోదా మనుకుంటున్నావు, అవునా ?' అని సూటిగా ప్రశ్నించాడు.

'అవును ! అందుకోసమే కూర్చున్నాను. లేక పోతే ఇంతసేపటిదాకా ఇక్కడ పడిగాపులు పడి ఉండడ మెందుకు ?'

'రంగన్నా ! నీ కంతకంతకి మతి పోతూంది సుమా ! ఈ పున్నమి వెన్నెల్లో ఎవరయినా గుర్తు పడితే ?—

'ఏది ఏమయినా సరే, నే నీవేళ గోపురంమీదికి వెళ్లితీరాలి !'

'నామాట విను ! తిరుమలరెడ్డికి తెలిస్తే కొంప లంటుకుంటాయి సుమా !'

'అంటుకోనీ !'

'మధ్య నీ సొమ్మేం పోయింది ! రేపిది నలుగురి నోళ్లలోను పడితే మీ బాబయ్యగారి పరువు, మర్యాద గంగలో కలిసిపోతాయి !''

'నీది ఎప్పుడు ఒకటే రోకటిపాట ! నాకా మాత్రం తెలియకపోలేదు. నా జాగ్రత్త నేను పడ గలను !' రుసరుసలాడుతూ చీదరించుకొన్నాడు రంగ నాయకుడు. అయినా గోపాలయ్య తన పట్టు విడిచిపెట్టలేదు. రెండు చేతులు గట్టిగా పట్టు కున్నాడు. రంగనాయకుడు ఒక్క ఊపులో అతని పట్టు విడిపించుకుని పెడముఖం పెట్టుకుని కూర్చున్నాడు. ధుమధుమలాడుతూ శిరస్సు పైకెత్తి గోపుర శిఖరంకేసి చూస్తూ కూర్చున్నాడు. అంతేగాని మరి గోపాలయ్యతో మాట్లాడలేదు. 'ఎంతలో ఎంతగా మారిపోయాడు రంగనాయ కుడు !' అనుకున్నాడు గోపాలయ్య. వా రిద్దరు ఆ బాల్య మిత్రులు. సహపాఠులు. ఇటీవలే ధోర ణులు కొంచెం వేరయ్యాయి. అయినా అతన్ని విడిచిపెట్టి వెళ్లడానికి గోపాలయ్య కేమాత్రము మనస్కరించలేదు. తానే ముందుగా ప్రసంగం ప్రారంభించి 'సరేలే ! త్వరగా గోపురం మీదికి వెళ్లి తిరిగిరా ! నేను కింది అంతస్తులో కూర్చుం టానులే !' అన్నాడు.

అప్పటి కర్ధరాత్రి దాటింది. కనుచూపు మేరలో ఎక్కడ మనిషి జాడ గోచరించలేదు. వెన్నె లతో కలిసి రంగనాయకుడు గోపురం కింది అంతస్తు చేరుకొన్నాడు. గోపాలయ్య అక్కడ ఒక

# విశాలనేత్రాలు

చోట గోడ కానుకుని కూర్చున్నాడు. రంగనాయకు డంతలోనే ఉడుములా చరచరా పాగిపోయి గోపురం పై అంతస్తులో నిలబడి నిశ్చల దృష్టితో శృంగారమంజరి భవంతి పరిశీలించాడు.

కాని ఎంతసేపటికి హేమసుందరి కనబడలేదు. 'ధ్వజస్తంభం గంటలు గణగణమని మారుమోగి నా హేమసుందరి కనబడలే దెందుచేత ? అని విత ర్కించుకొన్నాడు. తా నక్కడికి వస్తున్నానని మున్ముందుగా దాసి నాంచారమ్మ ద్వారా కబురు పంపించలేదు ! అయినా తలవని తలంపుగా హేమ సుందరి నొకసారి చూడాలని నిశ్చయించుకొన్నాడు. ధ్వజస్తంభం గంటల గణగణ ధ్వని వా రిద్దరు కలిసి ఏర్పరచుకొన్న మనోజ్ఞ ధ్వని సంకేతం. అదీగాక అనాడు తా నది ఒక శుభశకునంగా భావించాడు. కనక తన కోరిక తప్పక నెరవేరగలదని నిశ్చ యించుకొన్నాడు. కాని చిట్టచివరకి ఆశాభంగమే ఎదురయింది. రెప్పపాటయినా లేని ఏకాగ్ర నిశ్చల దృష్టితో రంగనాయకుడు మరికొంతసే పలాగే నిరీక్షించాడు.

శృంగార మంజరి మేడ పై అంతస్తు కిటికీ తటాలున తెరుచుకొన్నది. ఒక సుందరి కిటికీ చువ్వలమీద ముఖం మోపి నిలుచున్నది. ఆమె ఎవ్వరో కాదు ! హేమసుందరి ! రంగనాయకు డొక అరలిప్త కాలంలోనే గుర్తించాడు ! అతని శరీరం నిలువునా పులకరించింది. అల్లంతదూరంలో హేమ సుందరి ముంగురుల స్పర్శతో మనోహరాతి మనో హరమయిన పిలవెన్నెల తన నెన్నుదురు ముద్దు పెట్టుకొంటున్నదని అత డానంద పారవశ్యంతో ఉప్పొంగి క్రమక్రమంగా మైమరచి మరి బాహ్య ప్రపంచమే విస్మరించాడు! ఆవిధంగా ఎంతసేపు నిలుచున్నాడో అతనికే తెలియదు!

స్వామి పుష్కరిణిలో అప్పుడప్పుడు చిరుమీను లెగిరిపడి తళుక్కుమని మెరిశాయి. దేవాలయావర ణంలో దేవకాంచన పుష్పా లొకటి రెండు ఉండి ఉండి నేలమీద తూలిపడ్డాయి. గోపురం గూళ్లలో పావురాల కలరవం క్రమక్రమంగా మందగిం చింది. ఆకాశంలో తారక ఒకటి తటాలున జారి పడింది. క్రమక్రమంగా ఆ పరిసరంలో అంతటా నిశ్చల నీరవత అలముకొన్నది.

## 8

రంగనాయకుని కోసం గోపాలయ్య గోపురం కింది అంతస్తులో ఇంచుమించుగా ఒకటి రెండు గడి యలసే పలాగే పడిగాపులుపడి కూర్చున్నాడు. అయినా రంగనాయకుడు తిరిగి రాలేదు ! ఒకవేళ హేమసుందరి సందర్శనంతో మైమరచి మరి తన మాటే తలపెట్టడం మానివేశాడేమో ! రంగ నాయకు డెంతకయినా తగినవాడే ! సందేహం లేదు. తల పంకించాడు గోపాలయ్య. కొంచెం చిరాకు అలవోకగా అతని ముఖంమీద అలుము కొన్నది.

లేచి నిలుచుని అటు ఇటు పచారు సాగిం చాడు. మాటిమాటికి శిరస్సు పైకెత్తి రంగ నాయకుని రాకకోసం నిరీక్షించాడు. ఇంతటి అప రాత్రివేళ ఇంటికి జేరుకుంటే మాట దక్కదని

## గమనిక

ఆంధ్ర సచిత్ర వారపత్రికకు పంపే రచనలు

సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక

పేరుమాత్రమే పంపాలి. వ్యక్తుల పేర్లు

వ్రాయ వద్దని మనవి

నొప్పులను పోగొట్టుకొనుటకు

# సారిడన్ 'రోష్'

వేసుకోండి!















ఒకే ఒక బిళ్ల చాలును

ఒక బిళ్ళ ఖరీదు 13 నయా పైసలు

సారిడన్ నొప్పులకు వెంటనే ఉపశమనము కలిగిస్తుంది. అది మూడు విధములుగా పని చేస్తుంది—నొప్పిని పోగొట్టుతుంది. సేదదేరుస్తుంది మరియు నవోత్సాహమును కలిగిస్తుంది. తలనొప్పి, ఒళ్లనొప్పి, పంటినొప్పి, జ్వరముగా ఉండుట, మామూలు అస్వస్థతలు, మొ॥ వాటికి సారిడన్ వేసుకోండి. అది త్వరితముగా, నిశ్చయముగా మరియు నిరపాయముగా ఉపశమనము యిస్తుంది. ఒక సారిడన్ బిళ్ళ పెద్దవారికి పూర్తి మోతాదు. పిల్లలకు ¼ నుండి ½ బిళ్ళ వరకు చాలును.

'రోష్' తయారు

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వాల్లాస్ లిమిటెడ్.

JWT/VT-3522

# విశాల నేత్రాలు

భాగా భయపడ్డాడు. ప్రాణం విసిగి మరి నేచి ఉండలేక ఒక సారి పై అంతస్తుమీదికి పోయి చూడాలని కూడా ఆలోచించాడు. కాని బాగుండ దేమో అని మళ్లీ సంకోచించాడు. పోనీ రెండుమూ డంతస్తులు దాటిపోయి గట్టిగా గొంతెత్తి పిలి స్తేనో! మరి మార్గాంతరం లేదని నిశ్చయించు కొని తొందరగా పై అంతస్తు దగ్గరికి బయలు దేరాడు. వడివడిగా పది అడుగులు వేశాడు.

అంతలోనే 'అయ్యో!' అని అతని కొక సన్నని ఆక్రోశం వినిపించింది. అది రంగనాయకుని గొంతే! సందేహంలేదు! గోపాలయ్య నిమేష కాలం నిర్ఘాంతపడి తడబడుతున్న అడుగులతో అతి త్వరితగతితో గోపురం పై అంతస్తు సమీపించాడు. పెనుపెనుగులాటలో బా టతనికి పెద్ద పెద్ద పిడికిలి పోట్ల సవ్వడి వినిపించింది! గోపాలయ్య ఇంకా పైకెక్కి చిట్టచివరి మెట్టు మీద నిలబడ్డాడు. మరి తన కళ్లే నమ్మలేకపోయాడు.

కారెనుబోతు వంటి ఒక వ్యక్తి రంగనాయకుని తన సందిట ఇరికించుకుని, గట్టిగా అదిమి పట్టు కుని పిడుగులవంటి పిడికిలి పోట్లతో వీపుమీద, మెడమీద, నెత్తిమీద మాటిమాటికి చితక బోడు స్తున్నాడు! రంగనాయకు డా వ్యక్తి గిరజాల జుట్టు పట్టుకొని కింది కీడ్చి కొట్టాలని శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు. కాని ఎంతగా పెనుగులాడినా సాధ్యపడడంలేదు. అంతలోనే ఆ కారెనుబోతు అతని కాలు దొరకబుచ్చుకొని కిందికీడ్చి గుండెమీద కూర్చుని గొంతు చేజిక్కించుకొన్నాడు. అంతలోనే రంగనాయకు డొక్క విదిలింపుతో అతని భల్లూ కపు పట్టు విడిపించుకొని లేచి కూర్చుని పిడికిలి బిగించి శక్తికొద్ది కణతమీద కొట్టాడు! కాని అతడు అప్పటికే బాగా అలసిపోయాడు. అంత లోనే ఆ నూతన వ్యక్తి అమాంతంగా అతనిమీద విరుచుకుపడ్డాడు. గట్టిగా బిగించిన పిడికిళ్లతో తిరిగి వా రిద్దరిమధ్య పెద్ద పెనుగులాట ప్రారంభ మయింది.

గోపాలయ్య కళ్లెదుట అదంతా ఒక క్షణ కాలంలో జరిగిపోయింది! ఆ కొత్త వ్యక్తి శిరస్సు చెక్కలయ్యేటట్టు చితకగొట్టడానికి ఏద యినా దొరుకుతుందేమో అని అతడా అంతస్తు నాలుగు వైపుల పరిశీలించాడు. పెద్ద రాయి ఏది కనబడలేదు. ఒక మూల విరిగిన రెండు బాణాకర్ర ముక్కలు కనిపించాయి. పిల్లిలా వెళ్లి ఒక ముక్క అందుకొని తన యావచ్ఛక్తి వినియోగించి ఆ కొత్త వ్యక్తి నడి నెత్తిమీద గట్టిగా కొట్టాడు గోపాలయ్య. మరుక్షణంలోనే 'అయ్యో!' అని ఆక్రో శించి వా డక్కడే చాపచుట్టలా నేలమీద కూల బడ్డాడు. గోపాలయ్య వాడి వీపుమీద మోకా లానించి కూర్చుని తన తలపాగా విప్పి కాళ్లు చేతులు వెనక్కి విరిచి కట్టి పిడికిలితో మెడ మీద ఒక్క పోటు పొడిచాడు. విలవిల తన్నుకుని ఆ వ్యక్తి అతి కష్టంమీద వెనక్కి తిరగబడ్డాడు. అంతలోనే ఇంకొక పిడికిలిపోటుతో వాడి కణత ఖంగుమని మారుమోగింది. అంతే! వాడు మరి కదలలేదు. ఆ దెబ్బతో ప్రాణమే పోయి ఉండ వచ్చునని గోపాలయ్య అనుకొన్నాడు. ముక్కు పుటాల దగ్గిర వేలుంచి పరిశీలించాడు. అంతగా ప్రాణభయ మేమి కనబడలేదు.

ఆ పెనుగులాటతో బాగా అలిసిపోయి ఒక మూల కూలబడిన రంగనాయకు డప్పటికి కొంచెం తేరుకున్నాడు. తన స్నేహితుని వైపు చూసి సన్నని గద్గదస్వరంతో 'వచ్చావా! గోపాలయ్యా!' అని పలకరించాడు. రెండు మూడు కవోష్ణ బాష్ప అతని కనుగొలకులనుండి జారి నేలమీద రాలాయి. 'రంగా! ఏమిటిదంతా?' అని ప్రశ్నించాడు గోపా లయ్య. రంగనాయకుడు మరికొంచెం తేరుకుని స్నేహితుని ఆసరాతో లేచి కూర్చుని హీనస్వరంతో జరిగిన కథ మొదలుపెట్టాడు:

'ఏమో నా కిదేమి అంతుపట్టడంలేదు. హేమ సుందరి కనిపించిన తరువాత, మరికొంతసే పలాగే నిలబడి తిరిగి రెండుమూ డంతస్తులు దాటి కిందికి వచ్చాను. అంతలోనే అకస్మాత్తుగా వీడు నా వెనుకనుంచి వచ్చి బాణాతో వీపుమీద గట్టిగా కొట్టాడు. మళ్లీ ఇంకొక దెబ్బతో తల పగల గొట్ట వలసిందే! కాని గోడకి తగిలి బాణా రెండు ముక్కలయింది. అయినా మీది కురికి రెండు మూడు సారులు నేలమీది కీడ్చికొట్టి కాలో చెయ్యో విరిచివెయ్యాలని శాయశక్తులా ప్రయ త్నించాడు. కాని దైవానుగ్రహంవల్ల అది సాధ్య పడలేదు. నువ్వు ఇక్కడికి వచ్చేటప్పటికే నేను బాగా అలిసిపోయాను. ఒక అరగడియ ఆలస్య మయితే వాడు నా గొంతు నులిమి చంపివేసే వాడే! సరిగా సమయానికి వచ్చావు గాని, లేక పోతే నేటితో నా ఆయుర్దాయం నిండిపోయేదే!'

రంగనాయకుని గొంతు తిరిగి ప్రగాఢ గద్గ దికతో తొణికిసలాడింది. మరి చెప్పవలసిన దేది లేక మాట్లాడ కూరుకున్నాడు. అంతలోనే గోపాలయ్య అందుకొన్నాడు.

'సరేగాని ఇంతకీ వీడెవడు?'

'ఏమో!'

'ఇంతకుమును పెక్కడ వీణ్ణి చూడలేదా?'

'ఏమో చూచినట్టు జ్ఞాపకంలేదు!'

'అయితే నిన్ను వీ డెందుకు కొట్టాడంటావు?'

'అదే నేను ఆలోచిస్తున్నాను.'

'నీకు బాగా గట్టి దెబ్బలే తగిలినట్టున్నాయే! లేచి నిలబడగలవా?'

'భయంలేదు. మరికొంతసేపు అలసట తీర్చు కుంటే లేచి నిలబడగలను.'

అదే సమయంలో కింద పడిన వ్యక్తి కళ్ళు తెరిచి కొంచెం అటు ఇటు కదిలాడు. గోపాలయ్య వాడికి బాగా దగ్గిరిగా జరిగి కళ్లెర్రజేసి గొంతెత్తి గర్జించాడు:

'ఎవడవురా నువ్వు? నీపే రేమిటి?'

ఆ వ్యక్తి ప్రతి సమాధానం చెప్పలేదు. సన్నగా మూలిగాడు. అంతే.

'చాల్లే ఈ దొంగవేషం లింక కట్టిపెట్టు! లేక పోతే ఇదిగో ఇప్పుడే నీ గొంతు నులిమి రెండు కాళ్ళు దొరకబుచ్చుకుని నేలమీదికి విసిరివేస్తాను! జాగ్రత్త! తిన్నగా సమాధానం చెప్పు!'

ఆ బెదిరింపుతో ఆ వ్యక్తి హడలిపోయి 'సింహా చలం బాబూ!' అన్నాడు.

గోపాలయ్య మళ్లీ గర్జించాడు.

'అయితే నువ్వెక్కడ ఉంటున్నావు? ఇంత అప

తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక
సర్క్యులేషన్ అత్యధికమైనది!

త్వరలో

# మరొక సీరియల్ నవల

## ప్రారంభం!

వివరాలకు
ఎదురు చూడండి

# విశాల నేత్రాలు

రాత్రివేళ ఇక్కడ కెందుకు వచ్చావు ? నిజం
చెప్పు. నీకేమి భయంలేదు. లేకపోతే నీకీనాటితో
భూమి మీద ఋణం తీరిందన్నమాటే ! తెలిసిందా?

సింహాచలం మరి గత్యంతరంలేక తిరుమలరెడ్డి
తన్నక్కడికి పంపించిన సంగతి బయటపెట్టాడు.
ఆ సంగతి మాత్రం మరి ఎవ్వరితోను చెప్పవద్దని
డగ్గుత్తికతో ప్రబతిమాలుకొన్నాడు. రెడ్డి గట్టిగా
బెదిరించి బలవంతం చేసినందువల్లనే అటువంటి
అఘాయిత్యం పని తలపెట్టినట్టు, అంతేనేగాని
దానిలో తన తప్పేమీ లేనట్టు చెప్పి తప్పించు
కొన్నాడు. పేదవాడననీ, పిల్లలు కలవాడననీ ఆ
తప్పిదం మన్నించవలసినదనీ మాటిమాటికి మొర
పెట్టుకున్నాడు. రంగనాయకుని కప్పటికి వాడి
సంగతి కొంచెం బోధపడింది. అయితే తిరుమల
రెడ్డి తనమీద అంతగా పగబట్టడానికి గల అసలు
కారణమేమో అవగాహన కాలేదు. రంగనాయకు
డెన్నెన్ని విధాల భయపెట్టినా వాడు తన కంత
కన్న ఏమి తెలియదని మొరపెట్టుకున్నాడు. గోపా
లయ్య తిరిగి తిరిగి గద్దించినా రవంతయినా వాడి
ధోరణి మారలేదు.

'ఆయన అసలు రహస్యం నాలాటివాళ్ళతో
చెబుతారా బాబూ ! పొంచిఉండి మిమ్మల్ని
గట్టిగా కొట్టి రమ్మన్నారు. కొట్టాను. అంతే !
ఆయన మాటగాని కాదంటే పిల్లలు, నేను మల
మల మాడి చావలిసిందే ! ఎటుచూసినా మాలాటి
వాళ్ళ బతుకు లింతే బాబూ ! రెండు మూడు
రోజులనించి మిమ్మల్ని వెంటాడిస్తూనే ఉన్నాను.
కాని మీరది గమనించనేలేదు ! అప్పుడప్పుడు
గోపురంమీదికి మీ రొక్కరే రావడం కనిపెట్టాను.
మీకంటే ముందే వచ్చి ఈ వేళ ఈ అంతస్తు గదిలో
కిటికీ వెనకాల దాక్కున్నాను. అంతేగాని సొత్తు
దోచుకోవాలని మాత్రం నే నిక్కడికి రాలేదు !
గోపాలస్వామి సాక్షిగా, సత్య ప్రమాణ పూర్తిగా
ఉన్నది ఉన్నట్టు మనవిచేసుకొంటున్నాను. నా మాట
నమ్మండి ! పిల్లలు గలవాణ్ణి ! రక్షించండి !'

రంగనాయకుడు కొంచెం ఆలోచనలో పడ్డాడు.
శృంగారమంజరి తన సంగతి ఏదోవిధంగా కని
పెట్టి తిరుమలరెడ్డి చెవిని వేసి ఉండవచ్చునని
ఊహించాడు. అతడే ఇంతటి చెడ్డపని చేయించి
ఉండవచ్చునని నిశ్చయించి తలపంకించాడు.
దయతలచి విడిచిపెట్టవలసినదని సింహాచలం
తిరిగి ఇంకొకమారు మొరపెట్టుకొన్నాడు. దెబ్బ
లతో ఎంతగా బాధపడుతున్నా ఆ దీనాక్రోశం విన్న
తరవాత రంగనాయకుని మనస్సు కొంచెం మెత్త
బడింది. కట్టు విప్పి విడిచిపెట్ట వలసినదని
గోపాలయ్యతో అన్నాడు.

కాని అతడు దాని కంగీకరించలేదు. సింహా
చలాన్ని అలాగే తీసుకుపోయి తలవరి కప్పగించ
గలనని భీష్మించుకుని కూర్చున్నాడు. జలజల
ప్రవహిస్తున్న కన్నీటితో వాడు మళ్ళీ రంగనాయ
కుని వైపు తిరిగి మన్నించవలసినదని ప్రబతిమాలు
కొన్నాడు. అప్పటికి అర్ధరాత్రి మూడవ జాము
కూడా గడిచింది. దెబ్బలవల్ల నయితేనేమి, నిద్ర
లేమివల్ల నయితేనేమి రంగనాయకుడు బాగా అలిసి
పోయాడు. నిజం చెబితే విడిచిపెట్టగలనని గోపా
లయ్య మాట ఇచ్చాడు. అదీగాక సింహాచలాన్ని తల
వరి కప్పగించడంవల్ల లేనిపోని బెడద తనమీద విరు
చుకు పడగలదని కూడా సంకోచించాడు. దానాదీనా
వాణ్ణి విడిచిపెట్టవలసినదని గట్టిగా పట్టు
పట్టాడు.

గోపాలయ్య ఎట్టకేల కంగీకరించాడు. కట్టు
విప్పి ఎప్పుడు ఇలాంటి పాడు పనులు చెయ్య
వద్దని గట్టిగా హెచ్చరించి వాణ్ణి విడిచిపెట్టాడు.
సింహాచలం వా రిద్దరి పాదాలమీద సాగిలపడి దణ్ణాలు
పెట్టి స్వామికి నమస్కరించి లెంపలు వేసుకుని
చేతులు కట్టుకుని నిలుచున్నాడు. వారు ముగ్గురు
గోపురం దిగి ఆలయ సింహద్వారం దాటి వీధిలో
పడ్డారు. సింహాచలం తాను చెప్పిన రహస్యం బయట
పెట్టవద్దని మళ్ళీ కాళ్ళావేళ్ళా పడి ప్రబతిమాలు
కొన్నాడు. మిక్కిలి అడకువతో సెలవు తీసుకుని
తిరుమలరెడ్డి భవంతివైపు సాగిపోయాడు. గోపా
లయ్య స్నేహితునికి కొంచెం ఆసరా ఇచ్చి నడి
పిస్తూ 'రంగా ! జాలిపడి విడిచిపెట్టావుగాని వీడు
వట్టి దొంగవెధవ ! నమ్మడానికి వీల్లేదు ! ఒక
కంట కనిపెట్టిఉండాలి సుమా ! జాగ్రత్త !' అని
హెచ్చరించాడు. 'ఆఁ, నాకు వీడొక లెక్కా !'
అన్నట్టు హేళనగా ఒక చిరునవ్వు చిందించాడ
రంగనాయకుడు. నాలుగయిదు అడుగులు వేసి
తరవాత గోపాలయ్య మళ్ళీ అందుకున్నాడు :

'రంగా ! వీడి కిలాంటి పనులలో ఆట్టే బాగ
చెయ్యి తిరిగినట్టు కనబడడంలేదే !'

'సరిసరి ! చెయ్యి తిరిగినవా డయితే వీడిపాటి
మనల నిద్దరిని మహమ్మాయం చేసిఉండేవాడే
అంతదాకా ఎందుకు ? నువ్వు కొంచెం అలస్య
చేస్తే నా గతి ఇక ఆ స్వామికే ఎరుక !

'సరేగాని తిరుమలరెడ్డికి నీమీద ఇంత అక్కస్సు
ఎందుకు కలిగిందో మాత్రం తిన్నగా బో
పడటంలేదు !'

'ఇందులో బోధపడడాని కేముంది ? ఆ ఇంట్లో
ఎవరో నా సంగతి పసిగట్టి అతని చెవిని వే
ఉంటారు. సింహాచలం చెప్పింది చాలావరక
నిజమే అయిఉంటుంది.'

రంగనాయకుడు గోపాలయ్య భుజంమీద చెయి
వేసి నెమ్మది నెమ్మదిగా నడక సాగించాడు. వ
రిద్దరు నిచుళాపురం పొలిమేరలో ఉన్న ఇంటి
చేరుకునేసరికి పెరటిలో కోడి కూత వినిపించింది
వెంకటనాయకుడింకా అప్పటికి నిద్ర లేవలేదు. కా
రంగనాయకుని తల్లి లేచి ఇంట్లో ఏవేవో పనుల
చేసుకుంటున్నది. ఆత డది పసికట్టి నెమ్మదిగ
తలుపు తట్టి 'అమ్మా' ! అని పిలిచి చల్లి చల్లగ
లోపలికి జారుకోబోయాడు. హేమసుందరి వ్య
హారం అంతటితో పూర్తిగా కట్టిపెట్టమని స్నే
తుని చెవిలో చెప్పి గోపాలయ్య ఆ ఇంటి కల్లం
దూరంలో ఉన్న తన పొలంలో ప్రవేశించాడు.

(ఇంకా ఉంది

# హరివంశము

8-వ పేజీ తరువాయి

అర్థము కాకపోవుట యున్నది. అది అర్థము కాలే
దని తనకు అనిపించుచున్నది. కోరికకు అర్థము
కాకపోవుట యుండునో ! పౌండ్రకు డనుకొని
నాడు. అర్థమగుచో నది కోరికయే కాదు. అది
మరి యేదియో అగును. ఈ అర్థము కాకపోవుట
యం దశాంతి యున్నదా ! సుదక్షిణ నడుగవల
యును !

"ఎవరు !" అనినాడు వృద్ధ కంచుకి, వృద్ధము
లైన కన్నులను పైకి ఎత్తి.

"నేను. నేను పౌండ్రకుడను."

కంచుకి నవ్వినాడు. అంత వృద్ధాప్యములో
గూడ వానిలో జాగ్రత్త యున్నది.

"పౌండ్రకులా ? ప్రభూ! తాము వాసుదేవులు."

పౌండ్రకుడు వానిని చురుక్కున చూచి సుద
క్షిణ మందిరములలో ప్రవేశించెను. మందిరములో
చిన్నపుదీపములు వెల్గుచునే యున్నవి. పరి
చారికలు మేలుకొనియే యున్నారు. సుదక్షిణ
నిద్పురపోలేదువలె నున్నది. పౌండ్రకుడు సుద
క్షిణ మందిరమున ప్రవేశించెను. సుదక్షిణ మేలు
కొని యున్నది. ఏమో చదువుకొనుచున్నది. తాను
రాగా ఆమె తలఎత్తి చూచినది. ఆమె ముఖ
మెంత యందముగ నున్నది. సంకల్ప వికల్ప
రహితమైన, ఉపప్లవరహితమైన మనస్సువలె
నున్నది. ధర్మముయొక్క ప్రకాశమువలె నున్నది.

"సుదక్షిణ !"

"ప్రభు ! తాము వత్తురనియే అనుకొనినాను."

"అందుకనియే మేలుకని యుంటిని !"

"భగవంతుని చింతించుచు మేలుకని యున్నాను".

"ఎవరిని ! వాసుదేవునినేనా !"

"అవును స్వామి ! నాకు తాము వాసుదేవులు."

"వేషమును కట్టినప్పుడు గదా !".

"అప్పుడు తాము నాకు వాసుదేవులే కారు."

పౌండ్రకు డామెవంక విచిత్రముగా చూచెను.
ఆమె తన కర్థమైనది. కాలేదు. విచిత్ర మేమ
నగా ఆమెను చూడగా, ఆమె సమీపమున నుండ
తనకేమో సుఖముగా నుండెను. తన మనస్సు త
శరీరమునుండి వేరై యామెయందు నిహితమై
ఆమె పొందుచున్న శాంతిని, అందువలని సుఖము
పొందుచున్నట్టు లుండెను.

"సుదక్షిణ ! నా మనస్సు సుఖముగ నున్నది.

"అవును."

"నీకెట్లు తెలియును."

"తా మిప్పుడు మిమ్ములను గూర్చి ఆల
చించుటలేదు. నన్ను గూర్చి ఆలోచించుచున్నార
నేను భగవంతుని మరిచికను."

"నీవు నన్ను బాగుగా నెరుగుదువు."

"వేషము కట్టినప్పుడు తప్ప."

పౌండ్రకుడు గట్టిగ నవ్వినాడు. తనలోని స
మైన అశాంతియు తన నుండి నిష్క్రమనము చె
పట్లు లున్నది. ఈ నవ్వుటయు హాయిగా నున్న

"స్వామి ! మనస్సు శరీరము ఏకార్థస్థిత
లైనప్పుడు శాంతి యుండునని, సుఖము ల
నని కొంద రనుకొందురు. లది నిజముకా

# హరివంశం

శరీరము స్వరూపమైనది దనియందు దానికి కోరికలు లేవు కోరునది మనస్సు ఆ మనస్సును భగ భగవస్థితము చేయుట శాంతి సుఖము పెరో సుఖములు దబ్బరయు సరియే ఇది యంతయు దేనికి తాము శయనింపుడు తెల్లవారి ధర్మాసన ముండవలయును కదా! అని సుదక్షిణ పౌండ్రకుని పరుండబేనది పవానిని నిద్దురపుచ్చినట్లు నిద్దుర పుచ్చినది తన కెప్పుడు నిద్ర పట్టినదో పౌండ్రకునికు తెలియలేదు ఆ నిద్రలో ఎప్పుడో ఒక కల వచ్చినది తానును, సుదక్షిణయు ఎక్కడికో పోవుచున్నారు రథముపై పోవుచున్నారు ఆ రథమునకు సారథి లేడు లేడా! ఏదో నీలవర్ణము ఇదమిత్థ మనరాని మూర్తిని దాల్చి రథమును నడుపుచున్నది రథమునకు అవి హయములా! వానికిని ఆకారములేదు మొగిల నందలి నీలవర్ణము చేత నవియునధఃకరింపబడి, ఆక్రమింపబడి కన్పించుటలేదు అవియు నీలముగా నున్నవి తనకు ఆ హయములను తోలవలయునని, వాని ప్రగ్రహము లను పట్టవలయునని, రథమును నడిపించవలయునని అనిపించినది. తా నందుకు ప్రయత్నము చేసినాడు. అంతలో నా నీలవర్ణము శ్వేతవర్ణముగా మారినది. తనకేమియు కన్పించలేదు. సుదక్షిణ తన్ను పట్టుకొన్నది. సుదక్షిణ తన్నావరించి యున్నది. ఇప్పుడు ఉన్నది తానా! సుదక్షిణయా! సుదక్షిణయు లేదు. తానును లేడు. అంతయు శ్వేత వర్ణ, నీలవర్ణ కిర్మీరితమై విచిత్రవర్ణ సమ్మిశ్రమై అవభాసించినది. తనలో సుదక్షిణ ఏమో ప్రార్థించుచున్నది. ఆ విచిత్రవర్ణము మరల నీలవర్ణముగా మారినది. మరల రథము. మరల తాను. మరల సుదక్షిణ. ఇప్పుడు సుదక్షిణయు తానును వేరుకాదు. సుదక్షిణ తనలో యొక భాగము. ఇదీ యేదో అర్ధనారీశ్వరమైన రూపము. ఏదో విచిత్రమైన ఆనందము. ఆ ఆనందమే తానును సుదక్షిణయు నైనట్లున్నది. ఎప్పుడును ఇట్లులే యున్నచో

పౌండ్రకునకు మెలకువ వచ్చినది వైతాళికులు ఉచ్చస్వరముతో తన్ను మేలుకొలుపుచుండిరి తనకు మెలకువ వచ్చినది ఇది మెలకువయా? నాకొనినాడు పౌండ్రకుడు సుదక్షిణ తన [illegible] కన్నులను పూర్తిగా విచ్చి, [illegible] కొని, పౌండ్రకుడు మందిరమునందంతటను సదక్షిణకై కన్నులతో వెదకినాడు ఆమె మంచమునకు కాళ్ళవైపున నొక పీఠముపై కూరుచుండి భూర్జ పత్రమును ముందు పెట్టుకొని ఏమియో చదువుచున్నది

"సుదక్షిణా! కొంచెము బిగ్గరగా చదువుము"

"ప్రభువులు కాలకృత్యములను తీర్చుకొని, అగ్నిని ఆరాధించవలయును"

"నీవు ఆ చదువుచున్నది పైకి అన్నకొని చెప్పినట్లు లు చేసెదను"

సుదక్షిణ మధురముగ చదివినది

"యస్తు [illegible] విజ్ఞానవాన్ భవతి
అమనస్కః సదా ఽశుచి
న స తత్పదమాప్నోతి
సంసారం చాధి గచ్ఛతి" (సశేషం




# కొత్తనుడికట్టు- 5

## అడ్డం

1 వెన్నెల
3 ఇంగ్లీషు చిందరవందరయిపోయింది!
6 యముడు
7 రకంముందు మాకు చెందినది
8 ఎం(డకాయ
9 ఋషి
10 పాలమీదతరకలు.
11 చివర
12 గీతము
13 'వరకు' తిరగబడింది
14 తాటాకులగుడిసె
16 లెక్కలు
17 రామదాసుని జయిల్లోఉంచినవాడు తిరగబడ్డాడు

## నిలువు

2 మడిస్తే వచ్చేదేమిటి?
3 ఇది చెల్లించుకోవచ్చు
4 తెనుగుతల్లి
5 తూనికకువాడే ఒకగింజ
6 ఒకగొప్ప (సంస్కృత) వయ్యాకరణుడు
8 ఇది విరగడైందంటారు
9 కొసదేరిన ఒకదండము.
10 దీనిని నొక్కవచ్చు
11 "ఈ— ఎవరోయ్?" అంటాడు అగ్నిహో(త్రావధానులు
12 (దవలోహమా?
14 —, పునస్కారాలు
15 ఢిల్లీ—, ఒక (ప్రభువు

★

## 4 వ-కొత్త నుడికట్టుకు జవాబు

★

## అడ్డం

1 పిదప, 3 సతో, 6, లలన, 8 కోపం, 9 వగరు, 11 గరిక, 13 ఆపద, 14 రురువు, 16 నాసిక, 19 చిమ్మెట, 20 కిన్నెర, 21 ముక్క, 22. యమున.

## నిలువు

2. దగాకోరు, 4 తొలకరి, 5 ఆనక, 7 దోవ, 10 గన్నేరు, 11 గద, 12 కలిసి, 13 ఆవు, 15 రుధిరము, 16. నాటకము, 17 త్రి, 18 వాకిలి

# పొట్టికథలు

## చెల్లాయి మర్యాద

ఆ రోజు నేను మా అమ్మ భోజనము చేస్తున్నాము. మా చిన్న చెల్లాయి వీధిగదిలో ఆడుకుంటోంది. ఇంతలో ఎవరో తలుపు తట్టారు. మా చెల్లాయి తలుపుతీసి చూచింది. వచ్చినాయన బయటినుంచే మీ అన్నయ్యా ఉన్నాడా అని అడిగారు.

మా చెల్లాయి వంటింట్లోకి పరుగెత్తుకొనివచ్చి, "అమ్మా! ఎవరో వచ్చారే" అంది. మా అమ్మ దాని దుడుకు స్వభావం తెలిసినది కనుక "అన్నయ్య భోజనం చేస్తున్నాడు. కూర్చోమని మర్యాదగా చెప్పు" అంది.

వెంటనే అది వాయువేగంతో బయటికి పరుగెత్తి ఆ పెద్దమనిషితో "అన్నయ్య భోజనం చేస్తున్నాడు. మర్యాదగా కూర్చోమని అమ్మ చెప్పింది" అంది. అప్పుడే చెయ్యికడుక్కుని బయటకు వస్తున్న నాకు దానిమాటలు వినపడ్డాయి. దాని అమాయకత్వానికి నవ్వాలో ఏడవాలో తెలియలేదు. వెంటనే చెల్లాయిని కోప్పడి ఆయన్ను క్షమార్పణ కోరాను

కె. రాజు (రాంచి)

* * *

## వాగ్యుద్ధం

ఒకసారి ఓ ప్రముఖుడు జార్జి బెర్నార్డ్ షాను కలుసుకొనడానికి వెళ్లాడు. షా ఇంట్లో ఎక్కడా పూలకుండీ లేకపోయేసరికి అతడికి ఆశ్చర్యం కలిగింది.

"మీకు పూలంటే చాలా ఇష్టమని విన్నాను. మరి మీ ఇంట్లో ఎక్కడా పూలకుండీలు లేవే" ప్రముఖుడు షాని సూటిగా అడిగేశాడు.

"నిజమే నాకు పూలంటే ఇష్టమే. పసిపిల్లలంటే కూడా ఇష్టమే. కాని అంతమాత్రం చేత ఆ పిల్లల తలకాయలు కోసి పూలకుండీలలో పెట్టి ఇంటి నిండా అలంకరించుకోనుగా" షా నిర్మొహమాటంగా అన్నాడు.

ఎస్. సుందరయ్య (కంకిపాడు)

* * *

## కష్టమైన పని

ఆవిడ కళ్ళజోళ్ళు బేరమాడుతున్నది. ఎన్ని ఫ్రేములు తీసి పెట్టుకున్న ఆమెకేదీ నచ్చడం లేదు. షాపువాడికూడా విసిగేస్తున్నది. గాని, ఆవిడ తాపత్రయం చూసి జాలిపడి అమ్మా! యీ కళ్ళజోళ్లు అనలేఅందాన్ని పాడుచేస్తాయి. పైగా మీ కళ్లు మరీ పెద్దవేమో! సరే మా దగ్గర యీ ఫ్రేమ్‌ల కాలను మించి మరీ లేవు. మీ రెన్నిక చేసుకోండి" అని చెప్పాడు.

"అది సరేనయ్యా! యీ కళ్లజోళ్ళు నాక్కాదు మా స్నేహితురాలికి. అనలేమిటంటే యీ అద్దంల్లోంచి నా కద్దంలోని నా ప్రతిబింబం అగుపించందే ఎలా ఏడ్వనూ?" బాధపడందామె.

పి. నాగేశ్వరరావు (బెజవాడ) ★



### కథ కాని కథల రచయితలకు

### విజ్ఞప్తి

రచయితలీశీర్షికకు కేవలం 'హాస్య సంఘటనల'నే పంపుతున్నారు. నిత్యజీవితంలో చిత్రవిచిత్రాలైన సంఘటనలెన్నో తటస్థిస్తూ ఉంటాయి వాటిని గురించి కూడా వ్రాస్తే బాగుంటుందని రచయితలకు మనవిచేస్తున్నాము.


Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press 6 & 7, Thambuchetty Street Madras 1. Chief Editor, S. Sambhu Prasad.

